# మన సంస్కారాలు - మన సంస్కృతి



శ్లో॥ వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే॥
జగతః పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥


రచయిత :

**ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి**

"పండితరాజు" గ్రామనివాసి


శ్రీ వృషనామ సంవత్సర మార్గశిర శుద్ధ పంచమి


ముంగండ, పి. గన్నవరం మండలం, తూ॥గో॥ జిల్లా, ఆం॥ ప్ర



## రచయిత జీవితవిశేషాలు

జననం : తూర్పు గోదావరి జిల్లా ముంగండ గ్రామంలో 27-3-1914 న

తల్లిదండ్రులు : శ్రీమతి కామేశ్వరమ్మ, శ్రీరామమూర్తిశాస్త్రిగారలు

విశిష్ట విజ్ఞానం : 12 సంవత్సరాలు శ్రీ నారాయణమూర్తి అవధానిగారి వద్ద కృష్ణయజుర్వేదాధ్యయనం: శాస్త్ర కావ్య అధ్యయనం తండ్రిగారు శ్రీరామమూర్తిశాస్త్రి, మహీధర వెంకట్రామశాస్త్రిగార్ల వద్ద: వ్యాకరణ శాస్త్రం శ్రీ పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారి వద్ద: తెలుగు సాహిత్యం, పరిశోధన ప్రొ. కోరాడ రామకృష్ణయ్యగారి వద్ద

విద్య : 1938 మద్రాసు యూనివర్శిటీలో విద్వాన్‌లో ఉత్తీర్ణత

ఉద్యోగం : 1950-69 తెలుగు పండిట్‌గా బోర్డు హైస్కూళ్లలో

గ్రంథ రచన : 1966 - "కాళిదాస హృదయము" - గ్రాంథిక భాషలో
తెలుగులో : 1971-భక్త పోతన - మహాభాగవతరచన
1987 - హైందవ ధర్మామృతం
సంస్కృతంలో :1973 - కాళిదాస కావ్యసౌరభమ్
1983 - పండితరాజ జగన్నాథ మహాకవి:

రేడియో ప్రసంగాలు: విజయవాడ AIR "అమర భారతి" లో పెక్కు ప్రసంగాలు, విశాఖపట్నం AIR లో సూక్తి ముక్తావళులు.

అభిరుచులు : సంస్కృత భాషావ్యాప్తికై "భారతీయ విద్యానికేతన్" అధ్వర్యంలో సంస్కృత తరగతుల నిర్వహణ, ముంగండ గ్రామంలో జగన్నాథ పండితరాజ విజ్ఞాన మందిర స్థాపనలో విశేష కృషి, కాళిదాసు మరియు జగన్నాథ పండితరాజ రచనలపై విశిష్ట పరిశోధనలు.

బిరుదములు : 1) 1981 లో శ్రీ ఉప్పలూరి గణపతిశాస్త్రిగారిచే "వేదవిద్యావిశారద"
2) 1966లో శ్రీ కాశీ కృష్ణాచార్యులవారిచే "కాళిదాస రహస్య సర్వస్వాభిజ్ఞ - ప్రామాణిక విమర్శకాగ్రేసర"

'ప్రఖ్యాత' శ్రీ విజయలక్ష్మి పవర్ ప్రెస్, భట్నవిల్లి. ఫోన్ : 31088(O), 36220(R)

# మన సంస్కారాలు - మన సంస్కృతి



శ్లో॥ వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థప్రతిపత్తయే।
జగత: పితరౌ వందే పార్వతీపరమేశ్వరౌ॥

— రచయిత : —

**ఖండవిల్లి సూర్యనారాయణ శాస్త్రి**
"పండితరాజ" గ్రామనివాసి
శ్రీ వృషనామ సంవత్సర మార్గశిర శుద్ధ పంచమి
ముంగండ, పి. గన్నవరం మండలం, తూ॥గో॥ జిల్లా, ఆం॥ ప్ర॥



## -: అర్చన :-

"శ్రీకృష్ణం యదుభూషణం నరసఖం శృంగారరత్నాకరం
లోకద్రోహినరేంద్రవంశదహనం లోకేశ్వరం దేవతా౽
నీకబ్రాహ్మణగోగణా౽ర్తిహరణం నిర్వాణసంధాయకం
శ్రీకృష్ణం స్మభజామి భావకుసుమైః చిత్తస్యశాంత్యైసదా॥"

(ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రీయం పద్యమ్)

ప్రథమ ముద్రణ
డిశంబరు 2001

వెల : రు. **15-00**



ప్రాప్తిస్థానం :
ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి,
భారతీయ విద్యానికేతన్,
ముంగండ – 533 234

ముద్రణ :
శ్రీ విజయలక్ష్మి పవర్ ప్రెస్,
భట్నవిల్లి – 533 222
అమలాపురం మండలం (తూ॥ గో॥ జి॥)
☎ **31088** (STD 08856)

# మనసంస్కారములు-మనసంస్కృతి.

ఏత ద్గ్రంథసమర్పణము–



"సంస్కారసంస్కృతిగ్రంథమ్
మదీయమ్ ధర్మసజ్జితమ్ ।
శివాభ్యా మర్పయా మ్యద్య
సర్వసంస్కారసిద్ధయే ॥"

ఇట్లు గ్రంథరచయిత :
ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రి.
శ్రీ జగన్నాథపండితరాజగ్రామనివాసి (ముంగండ)

## "పండితరాయలగ్రామము"

ఖండఖండాంతరాల్ గణుతింపజాలిన
విజ్ఞానమే గ్రామవిలసనమ్ము
మల్లివాలతు లట్లు మస్తకధార్యమౌ
సూరిసంతతి నేది సొబగుమీరు
ఆర్యజనుల వేదవేదాంగపాఠాల
నాదాలతో నెప్డు నతిశయిల్లు
రామాయణాదులౌ రమణీయగోష్ఠులు
యతిశయపాఠాలు యతిగణాలు
రాణ నెచ్చట నేప్రొద్దు రమ్యమగుచు
శాస్త్రిజనులకు నెయ్యది సదనమగుచు
రాజు "పండితరాయలగ్రామ" మనగ
వాసికెక్కిన గ్రామము వరలుచుండె

(రచయిత పేరు మీది పద్యములో నున్నది)

## పండితాభిప్రాయము.

డా॥ ప్రసాదరాయకులపతి,
M. A., Ph D.,
Rtd. Principal, Hindu College,
**GUNTUR.**

*Residence :*
H. No. B1-C-40
Sri Saraswathi Nilayam,
4th Lane, Ravindra Nagar,
**GUNTUR** - 522 006
Phone : (0863) **231625**

**Executive President :** Sreenadhapeetham.
**Chairman :** Appajosyula & Vishnubhotla Foundation, **U. S. A..**
**President :** Tantra Vignana Parishat
**Hon. Editor :** Arsha Dharmam & Sreenadha Sahiti
గౌరవబిరుదములు : అవధానిశేఖర, ఆశుకవిచక్రవర్తి, సరస్వతీకంఠాభరణ, సాహితీసార్వభౌమ, రూపకసమ్రాట్, మంత్రశాస్త్రకళానిధి.

## ఆలోకనము.

బ్రహ్మశ్రీ ఖండవిల్లి సూర్యనారాయణశాస్త్రిగారు వేద వేదాంగవేత్తలు. విశేషించి సంస్కారసంపన్నులు. వీరి రచనలు అత్యంత ప్రమాణములు. శ్రుతి, స్మృతివాక్యము లనేగాక కావ్యములనుండికూడ సముచితమైన ఉదాహరణలు

స్వీకరించి పాఠకులకు చెప్పదలచిన అంశము సులభముగా, సుందరముగా సుబోధకము కావటానికి తగిన, చక్కని ప్రణాళిక నెన్నుకొని ఎంతోశ్రద్ధతో, నిష్ఠతో రచనచేశారు.

వేదసంస్కృతిలో అంతర్భాగమైన సంస్కారము లనుగూర్చి ఎక్కువమందికి తెలియదు. తెలిసినా ఆచరించే వారు తగ్గిపోయినారు. పాశ్చాత్యులవిద్యాప్రభావముచేత భావదాస్యముకలిగి సనాతనభావములమీద వ్యతిరేకత ఏర్పడినకాలము- మనఆచారములను అర్థములేనివని త్రోసిపుచ్చే అజ్ఞానులసంఖ్య రోజురోజుకు పెరుగుతున్నది. హేతువాదమనేపేరుతో మనసంస్కృతిలోని అమూల్యమైన విషయాలను మనం పోగొట్టుకొంటుంటే పాశ్చాత్యులు మనవిశేషాలను గ్రహించి ఉపయోగించుకొంటున్నారు. ఖండవల్లి వారు ఆవిషయంకూడ జాగ్రత్తగా పరిశీలించారు. వివాహంనుండి సంతానోత్పత్తివరకు జరిగే జీవితభాగాల లోని ఏయేసందర్భాలలో ఏయేపూజలు, హవనములు చేయాలో ఎంతోచక్కగా వివరించారు. భార్యాభర్తలు పృథివీస్వర్గములు, వాఙ్మనస్సులు, ఋక్సామలవంటి వారనే మంత్రప్రోక్తమైన ఉపమానాలలో ఉన్న సార స్యాన్ని వీరు వివరించారు. ధర్మాఽవిరుద్ధమైన కామము యొక్క విశిష్టతను సీతారాముల దాంపత్యంవంటి ఉదాహరణలతో సుసంపన్నం చేశారు. కాళిదాసకవితా హృదయాన్నికూడా ఆవిష్కరించి తమ పూర్వరచనలోని



కొన్ని అవసరమైన అంశాలను ప్రస్తావించి సమయోచిత భావచాలనం చేశారు.

వీనిని చదువుతున్నప్పుడు కాళిదాసు కుమారసంభ వంలో శివునిచేత సంధ్యావందనం చేయించిన ఘట్టము, భవభూతి అరణ్యంలో సీతాస్పర్శవల్ల శ్రీరాముడుపొందిన సమ్మోహనానుభూతి స్ఫురణకు వచ్చినవి. జరత్కారుకథ పఠిస్తుంటే భారతంలోని కథతోపాటు దేవీభాగవతంలోని మానసాదేవికథకూడా మనస్సులో మెదిలింది. ఈవిధంగా చిన్నగ్రంథంలోనే ఎన్నో అపురూపమైన విషయాలను స్పర్శించారు రచయిత.

ఇక యీసంప్రదాయాలలోని ఆధ్యాత్మికతవివరించే వేళ శాస్త్రిగారిహృదయగత తాత్వికచింతన, దీక్ష స్పష్టంగా గోచరిస్తుంది. బ్రహ్మభావుకులై వేదాంతవిచారణసలిపి జ్ఞానస్వరూపం తెలిసిన పండితులుమాత్రమే పలుకగలిగిన అద్భుతవిశేషాలను అందించిన శాస్త్రిగారికి పాఠకులు కృతజ్ఞులై ఉండకతప్పదు.

అయితే యీరోజుల్లో యిటువంటి గ్రంథాలు ఎందరి దగ్గరికి వెళ్ళుతవి ? ఎందరు చదువుతారు ? ఎంతమంది హృదయగతం చేసుకొంటారు ? ఎవరు కార్యాచరణ లోనికి తెచ్చుకుంటారు : ఇవన్నీ ప్రశ్నార్థకాలు. ఏదైనా ఒకఅనిదంపూర్వమైన గ్రంథం, పరిశోధనాత్మక మైన ప్రమాణగ్రంథం తెలుగువారికి లభించింది. సూర్య నారాయణశాస్త్రిగారికి హృదయపూర్వకమైన అభినందన సమర్పిస్తున్నాను.

# కృతజ్ఞత.

డాక్టర్ ప్రసాదరాయకులపతి మహాభాగులు విశ్వవిజ్ఞానవిరాజితులు, సౌజన్యసింధువులు, భారతీయధర్మసంరక్షణదీక్షాదీక్షితులు. ఇంతటి మహాత్ములకు కొండంత దేవునకు గోరంతపత్రి అన్నట్లు నాకృతజ్ఞతాసమర్పణం అల్పాల్పమైనదే. అల్పజ్ఞుడనైన నామీద డా॥ కులపతి మహోదయులప్రశంసాకనకవర్షం ఎప్పటికీ మరపురానిదే. ఇందులకు హార్దికాశీరలంకృతములైన మదీయ భక్త్యంజలుల సమర్పణము మాత్రమే.

నారచనను చక్కగాముద్రించియిచ్చిన 'ప్రఖ్యాత' శ్రీ విజయలక్ష్మి పవర్ ప్రెస్, భట్నవిల్లివారికి నాకృతజ్ఞతాశీస్సులు.

— రచయిత.

ఓమ్

శ్రీమహాగణాధిపతయే నమః

# మనసంస్కారాలు—మనసంస్కృతి.

## సంస్కారశబ్ద నిర్వచనము.

"సంస్క్రియన్తే ఏభి రితి సంస్కారాః...."

అనగా రత్నధాన్యాదివస్తువులు, మానవులుకూడా సంస్కారములచేత సంస్కరింపబడతారు. అనగా బాగుచేయబడతారు అని అర్థము. ఏలాగుననగా మానవులు పుట్టుకతోనే బాలారిష్టాదిదోషములతో పుడతారు. అదోషాలు 'జాతకర్మ' అనబడే సంస్కారమును శాస్త్రోక్తముగ చేయుటచేతనే తొలగిపోతాయి. వారు విద్వాంసులౌతారు.

ఇకరత్నములు- వాటిని రత్నపుగనులనుండి తేగానే అవిమట్టికొట్టుకుని పైకి మట్టిబెడ్డలవలె కనిపిస్తాయి. వాటిని కొన్నిఏసిడ్సుతో కడిగి, వాటిమట్టిని పోగొట్టినపిమ్మట రత్నపు పోగరతో వాటిని తరివిడిపెట్టి వాటికి రంధ్రాలు చేస్తారు. ఇన్ని సంస్కారాలు అనగా బాగుసేతలు చేసిన పిమ్మటనే అరత్నాలు "జాతిరత్నాలు"గా తయారై రత్నహారాదులుగా మెరుస్తూ మననిత్యజీవితంలో అవి వివిధ భూషణములుగా ఉపయోగిస్తాయి.

ఇట్లే మనకు నిత్యము ప్రాణాధారవస్తువైనవి 'ధాన్యం'. ఇవి ధాన్యదశలో ఉన్నంతవరకు మనకు ఉపయోగపడవు. వీటిని చేలోనుండి కోసితెచ్చి బల్లపై కొట్టి తూర్పారబెట్టి, అనగా ఎగురబోసి మిల్లులో బియ్యంగాచేసి వండినపిమ్మటనే అవి అన్నంగా తయారై మనజీవనాధార మౌతాయి. ధాన్యంనుండి అన్నంవరకు మధ్యచేసిన బాగుసేతలకు "సంస్కారములు" అనిపేరు. ఇన్నిసంస్కారములు చేస్తేనేగాని మనకవి నిత్యోపయోగంలోనికి రాలేదనే విషయం గమనించాలి. ఈసందర్భంలో ఒకసూక్తియిది.

"రత్నానపి విహాయైవ కర్తవ్యో ధాన్యసంగ్రహః"

అనగా రత్నములను విడచిపెట్టియైనా సరే మానవులు ధాన్యమును మాత్రం (ముందుజాగ్రత్తగా) నిల్వచేసుకోవాలి. ఎందుకంటే రత్నములు మనవద్దలేకున్నా బ్రతుకగలముగాని, మనఅన్నమునకు మూలవస్తువైన ధాన్యం మనవద్దలేకుంటే ఒకరోజైనా (అన్నంలేకుండా) బ్రతుకలేము. ఇంతటి ప్రాణాధారమైన అన్నమును గూర్చి ఒక తైత్తిరీయోపనిషత్సూక్తియిది-

"అన్నం బ్రహ్మేతి వ్యజానాత్, అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే, అన్నేన జాతాని జీవన్తి ...."

అనగా అన్నమును బ్రహ్మస్వరూపంగా (అందరు) భావించవలెను. మనం తినిన అన్నరసం క్రమంగా



'వీర్యం'గా మారి దానివలన అన్నిజీవరాసులు పుట్టి పెరుగుచు జీవించుచున్నవి.

ఇట్లు చరాచరసృష్టికి "అన్నం" మూలాధారమైనది కదా ! "కలా వన్నగతప్రాణాః" అనే సూక్తికూడ 'అన్నం' యొక్క 'పరబ్రహ్మత్వాన్ని' పునరుద్ఘాటిస్తూంది. ఇంతకు యింతప్రాణాధారమైన 'అన్నము'నకు మూలమైన ధాన్యమునకు సంస్కారములే మూలకారణములు అనేమాట మరువరానిదై యున్నది. ఈసంస్కారములు లేనినాడు మనకు అన్నం లభించియుండేది కాదుకదా !

## గర్భాధానము

సంస్కారము లన్నింటిలోను యిది మొదటి సంస్కారము. దీనిని సమంత్రకంగానే జరిపించవలెను. ఈ సంస్కారం సమంత్రకముగా చేయనిస్త్రీకి జనించిన సంతానం దుష్టభావాలుకల దౌతుందని-

"గర్భాధానస్యాఽకరణాత్ తస్యాం జాతస్తు దుష్యతి" అనేస్మృతివాక్యం తెలిపింది.

నిజానికి యీమొదటిసంస్కారం దంపతులకు ఉత్తమసంతానప్రాప్తికై ఉద్దేశింపబడినది. ఎట్లనగా వివాహానికిముందు స్త్రీపురుషులయొక్క నియమరహితప్రవర్తనమువలనను, చెడ్డసంకల్పాదులచేతను, వారి రేతోబీజాలకు కొన్నిదోషాలు సంక్రమిస్తాయి. ఆదోషాలు తొలగిపోవ

టకై చేయదగిన సంస్కారకర్మలనుగూర్చి 'మనుస్మృతి' యిలా చెప్పింది.

"గార్భైర్హోమైః జాతకర్మచౌలమౌంజీనిబంధనైః
బైజికం గార్భికం చైనో ద్విజానా మపమృజ్యతే।"

అనగా గర్భాధానసంస్కారమునకు చెందిన హోమ నిర్వహణము చేతను, మరియు జాతకర్మ, చౌలోపనయన సంస్కారములకు చెందిన హోమముల నిర్వహణముచేతను దంపతుల రేతోబీజములకు చెందిన పాపములు తొలగిపోవును. ఇట్లు దోషరహితులైన దంపతులకు జనించిన సంతానం ఉత్తమగుణసజ్జితమై క్రమంగా అట్టి సత్సంతానము వంశదేశాభ్యుదయములసంపాదనకు సమధికకారణమగును. మీదచెప్పిన విషయములనుబట్టి యీ మొదటి సంస్కారం వైదికహోమ నిర్వహణపూర్వకముగా జరిపించటమనేది ముఖ్యమనియు, అట్టిస్త్రీకి కలిగినసంతానమే సర్వవిధముల తమకు, దేశమునకు అభ్యుదయప్రదమౌతుందనియు స్పష్టమయినది.

ఇక తండ్రికి మూడవఋణముగా మిగిలియున్న పితృఋణం అనేది ఉత్తమపురుషసంతానంచేతనే తీరిపోతుంది. ఇట్టిఉత్తమత్వప్రాప్తికి యీ మొదటి సంస్కారం_

"గార్భైర్హోమై ర్జాతకర్మ...."



అనే మనుస్మృతి సూక్తిప్రకారం వైదికహోమనిర్వహణ పూర్వకముగానే జరిపించటం ముఖ్యాతిముఖ్యమై యున్నదని సారాంశం.

ఈసంస్కారమును స్త్రీ రజస్వలయైన తర్వాతనే సమంత్రకముగా చేసుకొనవలెను. A. చూ."హిందూవివాహ విశిష్టత" అనే వ్యాససంపుటిలో 'అభినవాపస్తంబ' ప్రభృతి మహోన్నతబిరుదములతో అలంకృతులైన బ్రహ్మశ్రీ లంక వేంకటరామశాస్త్రిసోమయాజిమహోదయుల మొదటివ్యాసము (శ్రీ సోమయాజిగారు 1999 సం॥రంలో పరమపదించినారు)

-: పుం (సు) సవనము :-

స్త్రీ గర్భము ధరించినట్లు వ్యక్తమైనతర్వాత చంద్రుడు పురుషనక్షత్రంతోకూడియున్నరోజున 'పుంసవన' సంస్కారం చేయవలెనని పారస్కరగృహ్యసూత్రకారుడు తెలిపినాడు.

భార్యకు 3వమాసంలో ప్రథమగర్భమునకు మొదటిసారిగా భర్త చేసే సంస్కార మిది. ఇందు భర్త వైదిక

---

A ఈవ్యాససంపుటియొక్క ప్రాప్తిస్థానం :
సనాతనధర్మ ప్రచారసమితి, శ్రీవిజయలక్ష్మి పవర్ ప్రెస్,
భట్నవిల్లి - 533 (తూ॥గో॥జిల్లా) (ఆం. ప్ర.)
STD : 08856 © O. 31088 R. 36220
ప్రకాశకులు : బులుసు సూర్యనారాయణ, B. A.,
వెల : రు. 25/-

మంత్రాలతో హోమాలుచేసి సహదేవరసంతో కలిపి నూరిన మర్రిచిగుళ్ళ రసాన్ని భార్యయొక్క కుడివైపునగల ముక్కురంధ్రంలో ఉంచినచో ఆరసం క్రమంగా స్త్రీగర్భాన్ని చేరి పురుషసంతానమును కలిగిస్తుందని ఆపస్తంబగృహ్యసూత్రకారుడు-

"కర్మణా అనేన సంస్కృతా నారీ పుమాంసం జనయతి"

అనితెలిపినాడు. ఇది గర్భమునకు చేసే సంస్కారము.

## -: సీమంతము :-

ఈసంస్కారం భార్యకు 6 లేక 8వ మాసంలో భర్త చేయవలెను.

"ప్రథమగర్భే మాసే షష్ఠేఽష్టమే వా...."

అని పారస్కరులు చెప్పినారు. కనుక యీసంస్కార నిర్వహణకు 6, 8 మాసములు శ్రేష్ఠమైనవి.

"సీమంతోన్నయనం" అనికూడ దీనికి పేరుకలదు. అంటే భార్యజుట్టును సగభాగం యెత్తిపట్టి అక్కడ భర్త యీసంస్కారం చేస్తాడు. కనుక దీని కీపేరు వచ్చినది. "ఆసురీశక్తులు అనబడే దుష్టరాక్షసశక్తులు మానవుల వినాశమునకు కారణమగుచుండగా దైవీశక్తులు మానవుల జీవితాభ్యున్నతికి ఆదికారణము లగుచుండును'' అని భగవద్గీతలో-



"దైవీసంపద్విమోక్షాయ నిబంధాయాసురీమతా" అని చెప్పబడినది. (చూ. 16వ అధ్యాయం)

కొన్నిరాక్షసశక్తులు భార్యయొక్క మొదటిగర్భమును పాడుచేయుటకురాగా భర్త కొన్నివేదమంత్రముల పఠనసాధనంతో ఆదుష్టశక్తులను తరిమివేసి భార్యగర్భమును కాపాడుతాడు. ఆసందర్భములో అశ్వలాయన మహర్షి చెప్పిన కొన్నివాక్యాలభావ మిది. భార్య మొదటి గర్భాన్ని కబళించవలెననే పూనికతో రక్తపానతత్పరలైన కొందరురాక్షసస్త్రీలు రహస్యంగా రాగా యిది తెలుసుకొన్న భర్త వేదమంత్రాలపఠనంతో ఆదుష్టశక్తులను తరిమివేయుటకు 'సీమంతకరణి' అనే దైవీశక్తినిసమంత్రకముగా ఆహ్వానించి యీ'సీమంతసంస్కారం'లో ఆరాధిస్తాడు. ఈ విషయజాతమును విస్పష్టం చేస్తూన్న ఆశ్వలాయనమహర్షి వాక్యా లివి-

"పత్న్యాః ప్రథమజం గర్భం అత్తుకామాః సుదుర్భగాః ఆయాంతికాశ్చిద్రాక్షస్యఃరుధిరాశనతత్పరాః।" తాసాం నిర్హరణార్థాయ శ్రియ మావాహయేత్పతిః। సీమంతకరణీ లక్ష్మీః తామాహ్వయతి మంత్రతః"

ప్రస్తుతంలో 5 లేక 7వ మాసంలో స్త్రీకి గాజులు పెట్టుటవరకే యీ 'సీమంతసంస్కారం' మిగిలియున్నది.

## -: జాతకర్మసంస్కారం :-

జాతకర్మ సంస్కారప్రాధాన్యమును గూర్చి బార్హస్పత్యసంహిత యిలా ప్రశంసించినది-

"జాతస్యాఽరిష్టనాశాయ, నీరోగత్వాయ సర్వదా దీర్ఘాయుష్యాయ చాన్యత్ర సర్వసంపత్సమృద్ధయే జన్మస్యశుభయోగానాం వినాశాయ విశేషతః ।"

అనగా మగశిశువు పుట్టిన వెంటనే (ఆశిశువునకు బొడ్డుకోయకుండగనే) తండ్రి[A] జాతకర్మ సంస్కారమును చేయవలెను. అట్లు చేయుటవలన శిశువునకు పుట్టుకతోనే సంక్రమించిన బాలారిష్టాదిదోషాలు నశిస్తాయి. ఇంకా ఆశిశువునకు భావికాలంలో తరచుగా రాబోయే రోగములు తొలగిపోతాయి. ఈసంస్కారనిర్వహణ ప్రభావంవలన శిశువునకు దీర్ఘాయుష్యము, సర్వవిధసంపత్సమృద్ధి అనే ప్రత్యేకాభ్యుదయములు ప్రాప్తించును. ఇంకాశిశువునకు జన్మకాలములో సంక్రమించిన "అమంగళయోగములు"

---

A "జాతమాత్రే కుమారే తు జాతకర్మ విధీయతే, ప్రాక్ నాభికృంతనా త్పుంసో జాతకర్మ విధీయతే, యావ న్న ఛిద్యతే నాళం తావన్నాప్నోతి సూతకం, ఛిన్ననాళే తతః పశ్చాత్ సూతకం తు విధీయతే" అనగా శిశువునకు బొడ్డుకోసినవెంటనే తల్లిదండ్రులు మున్నగువారికి సూతకము అనగా పురిటిదోషము వచ్చును. ఈదోషముతో తండ్రి వేదమంత్రపఠనంతో ఫలీకరణహోమాలు చేయకూడదు. కనుక శిశువునకు బొడ్డుకోయకుండగనే యీ జాతకర్మసంస్కారమును సమంత్రకముగా నిర్వహించవలెనని మహర్షుల ఆదేశం.



(యీసంస్కారనిర్వహణప్రభావంవలననే) అంతరించును (ఇది ప్రత్యేకప్రయోజనము). ఇకతండ్రి పురిటింటి గుమ్మానికి యివతలప్రక్క అగ్నిని ప్రజ్వలింపజేసి అందు తౌడు + ఆవాలు కలిపినద్రవ్యాన్ని సమంత్రకముగా (అగ్ని ప్రజ్వలిస్తూన్నపుడు) అందు హోమం చేయవలెను. హోమం చేసిన ఆద్రవ్యం హుతమగునపుడు అగ్నినుండి పరిమళభరితమైన ధూమం (పొగ) వెలువడును. అట్టి పొగ సోకినశిశువులకు భావిలో శారీరకరుగ్మతలు ఉండవని భావిని తెలుసుకున్నమహర్షులభావన. కనుకనే యీ ఫలీకరణ హోమాన్ని మనమహర్షులు పురిటింటిగుమ్మంవద్దనే యేర్పాటుచేసినారు ఈఫలీకరణహోమసంప్రదాయంజానపద కవితలో కూడా యిలా ప్రతిబింబించింది.

చిన్నికృష్ణుడు జనించినవైనం తెలుసుకొనిన గోప కాంతలు నందునియింటికి రాగా వారిలో ఒకవృద్ధకాంత యశోదతో యిలా అన్నది-

"ఉల్లీపొట్టూ తౌడావాలూ- ఉగిదరొ పొగవైమీ...."

ఉల్లిపొట్టు+తౌడు+ఆవాలు కలిపినద్రవ్యాన్ని అగ్నిలో వేసినపుడు (అవి హుతమౌతున్నపుడు) వచ్చిన పొగసోకిన వారికి భూతప్రేతపిశాచాదులవలన వచ్చేబాధ లుండవని "వస్తుగుణప్రదీపిక" తెలుపుచున్నది. ఈవిధంగా మన మహర్షుల విశ్వశ్రేయస్సంపాదనదృష్టి విశ్వవినుతంగానే సర్వదా ఉంటుంది.

దిలీపమహారాజునకు పుత్రుడు పుట్టినట్లు తెలియగనే కులగురువైన వసిష్ఠమహర్షి తనతపోవనమునుండివచ్చి ఆదిలీపసూనునకు 'జాతకర్మసంస్కారము'ను శాస్త్రోక్తముగా జరపగానే ఆబాలుడు అప్పుడే గనినుండి తెచ్చిన రత్నమునకు కషణాది సంస్కారములు చేసినవెంటనే అది పూర్వాధికముగా ప్రకాశించినట్లు సంస్కారసంస్కృతుడైన ఆబాలుడు పూర్వాధికముగా ప్రకాశించినాడట. (చూ. కాళిదాసకవీంద్రునిరఘువంశకావ్యం సర్గ 3,శ్లో.18)

"వీరమిత్రోదయము" అనే ధర్మశాస్త్రగ్రంథం 'సంస్కార' శబ్దమునకు చెప్పిన నిర్వచన మిది.

"మానవానాం అంతరనిష్ఠః విహితక్రియాజన్యః అతిశయవిశేష స్సంస్కారః"

అనగా మానవుల మనస్సులలో అంతకుముందు లేనిదీ, సంస్కారనిర్వహణానంతరకాలమందే మానసిక శుద్ధి భావరూపంలో అప్పటికప్పుడు జనించినది. అయిన అతిశయవిశేషమే అనగా (ఆంతరికశుద్ధే) "సంస్కారము" అని చెప్పబడును. ఈసంస్కారశబ్ద నిర్వచనముతో కాళిదాసీయశ్లోకమునకుగల సమన్వయము. మణికి అంతకుముందులేని శోభ కషణాదిసంస్కారానంతర కాలమందే క్రొత్తగా జనించినట్లు దిలీపసూనునకు జాత కర్మసంస్కారనిర్వహణకు ముందులేని శోభ యీసంస్కార నిర్వహణాఽనంతరమందే క్రొత్తగా అతిశయవిశేష రూపంలో ఆబాలునకు ఆవహిల్లినది.



ఈసంస్కారములనుగూర్చి మనుస్మృతియందు చెప్పినశ్లోక మిది-

"వైదికైః కర్మభిః పుణ్యైః నిషేకాదిద్విజన్మనాం।
కార్య శ్శరీరసంస్కారః పావనః ప్రేత్య చేహ చ ॥"

తా॥ వేదమంత్రములతో కూడిన గర్భాధానాది సంస్కారకర్మలచే ద్విజుడు సంస్కృతుడై యీలోకమందును, పరలోకమందునుకూడ పాపక్షయము చేసుకొనుటద్వారా పవిత్రుడై యిహపరశ్రేయస్సులను సులభముగా పొందగలుగుచున్నాడు.

## -: నామకరణం :-

"ఏకాదశేఽహని నామకరణం కుర్యాత్" (ఆప.గృ.)

తల్లిదండ్రులు తమపుత్రునకు ముందుగా 'వేద' నామమును పెట్టుటవలన ఆబిడ్డడు నూరేళ్ళు జీవించునని-

"వేదో వై పుత్రనామాఽసి సజీవ శరదశ్శతమ్"

అని వేదమంత్రం తెలిపినది.

### -: పేరులోని అక్షరసంఖ్యనుగూర్చి :-

"బ్రాహ్మణ మయుజాక్షరం, కుమార్యాః విషమాక్షరం...."

అనే స్మృతివాక్యమును బట్టి మగపిల్లలపేరులోని అక్షరములు సరిసంఖ్యలోను, ఆడపిల్లలపేరులోని అక్షరములు బేసిసంఖ్యలోను ఉండవలెను.

ఇక మగపిల్లవానికి యెటువంటిపేరు పెట్టవలెననగా-

"ఋష్యణూకం దేవతాఽణూకం వా యథా వైషాం పూర్వపురుషాణాం నామాని స్యుః"

తా॥ మహర్షులు, దేవతలు తమవంశంలోని ప్రఖ్యాత పురుషులు, యిట్టి మహనీయులపేర్లు తమపుత్రులకు పెట్టినచో అట్టిబాలురు అచిరభావిలో మంచిపేరుప్రఖ్యాతులు కలవారౌతారని పైస్మృతిసూక్తి తెలిపింది. (అణూకం= పేరు) ఇట్టిమంచినామధేయములతో పిలువబడినవారికి దీర్ఘాయుర్దాయము కలుగుతుందని ఆర్షసంప్రదాయము.

"ఆచారః పరమోధర్మః, నృణాం కళ్యాణకారకః ।
ఇహలోకే సుఖీభూత్వా పరత్ర లభతే సుఖం ॥"

"ఆచారము" అనగా సత్సంప్రదాయం. అంటే సదాచారం. ఇది ఉత్తమ ధర్మరూపమైనది. ఇట్టిధర్మం మానవులందరకు వారి యిహపరములలో సుఖశాంతులను, క్రమంగా ముక్తినికూడ కలిగింపగలిగియున్నది.

## -: అన్నప్రాశనము :-

"అన్నప్రాశన మర్భకస్య శుభదం మాస్యేవ యుగ్మే శుభే। షష్ఠాదావథ పంచమాదివిషమే మాసే వధూనాం శుభే" (పూర్వకాలామృతము)

తా॥ మగపిల్లలకు 6 మొదలగు సరిమాసములలోను, ఆడపిల్లలకు బేసిమాసములలోను అన్నప్రాశనము శుభప్రదమైనది.

"జన్మనోధి షష్ఠేమాసి...."

అనిఆపస్తంబమహర్షికూడా పూర్వకాలామృతకారునివలెనే 'షష్ఠేమాసి....'అని, అన్నప్రాశనకు మగపిల్లలకు 6వమాసమే శ్రేష్ఠమైనదని పునరుద్ఘాటించినాడు.



"ముఖ్యకాలపరిత్యాగాత్ శిశు ర్గుణవిహీనవాన్ ।
అతః షణ్మాసతః కుర్యాత్ అన్నప్రాశన మాదరాత్ ।"

పైవిధంగా ముగ్గురుప్రామాణికులు ఏకగ్రీవముగా మగపిల్లల అన్నప్రాశనమునకు 6వ మాసమే శ్రేష్ఠమైనదని తెలుపుచుండగా 6వ మాసమును దాటబెట్టరాదు. ముఖ్యకాలంలో చేసిన మంచిపని అచిరకాలంలోనే విశిష్టఫలప్రదమౌతుందన్న విషయం మనఅనుభవంలోనిదేకదా !

## - చౌలం :-

'చౌలం' అనగా పిల్లవానితలపై శిఖలనుంచుట. హోమపూర్వకముగా 3గాని, 5గాని వారికులాచారప్రకారము పిల్లవానితలపై శిఖలనుంచుట. ఇది సమంత్రకము, హోమములతో కూడినదికూడాను.

"జన్మనోధి తృతీయే వర్షే చౌలం పునర్వస్వోః"
అని ఆపస్తంబమహర్షి చెప్పినాడు.

"చూడాకర్మద్విజాతీనాం సర్వేషామేవ ధర్మతః ।
ప్రథమేఽబ్దే తృతీయే వా కర్తవ్యం శ్రుతిచోదనాత్ ॥"

ప్రస్తుతకాలములో 'కేశఖండనమే' చౌలమనికొందరు తలుస్తున్నారు. ఇది సరికాదు. కారణము మంత్రయుక్తముగా జరిగినదానికే "చౌలము" అని వ్యవహారము. అట్టికర్మచేతనే కర్తకు భావికాలంలో పితృకర్మలయందు అధికారము కలుగును.

## -: ఉపనయనము :-

"ఉపనయనం విద్యార్థస్య శ్రుతిత స్సంస్కారః"
—ఆప. ధర్మసూత్రం 1-1-9

అనగా వేదాధ్యయనముకొరకు శ్రుతిమంత్రముల చేత చేయబడుసంస్కారమే 'ఉపనయనము' అనబడును.

"అగ్నికార్యా త్పరిభ్రష్టాః సంధ్యోపాసనవర్జితాః ।
వేదం చైవాఽనధీయానాః తే సర్వే వృషలాస్మృతాః ॥"
— పరాశరస్మృతి 12-31

వేదాధ్యయనము చేయని బ్రాహ్మణునకు 'వృషలుడు'అనిపేరు. వృషలుడుఅనగా శూద్రుడు లేక పాపాత్ముడు అనిఅర్థము కనుక బ్రాహ్మణబ్రహ్మచారులకు వేదాధ్యయనము నిత్యమైనదీ, ఆవశ్యకమైనదీ కూడాను.

ఆచార్యుడు (తండ్రి) వటువును గాయత్రీమంత్రోపదేశార్థమైతనసమీపమునకు తీసుకొనుట యిందు ప్రధానమైనది. ఈపరమార్థం 'ఉపనయనం' అనుపేరులోనే యున్నది. కనుకనే అన్నిసంస్కారములకంటెను యీ సంస్కారమునకే ప్రత్యేకప్రాధాన్యత ప్రాప్తించింది.

ఉపనయనమును మూడురోజులు తప్పకచేయవలె ననుటకు గలకారణములివి -

"త్ర్యహమే తమగ్నిం ధారయంతి...."
(ఆప. గృ. సూ. 11-19)



అనగా ఉపనయనం మొదటిరోజు ప్రాతఃకాలంతో ప్రారంభించి సంధ్యావందన అగ్నికార్యములను ప్రాతస్సాయంకాలములలో మూడురోజులు వరసగా చేయవలెనని ఆపస్తంబసూత్రం విధించినది. మరియు-

"వాసశ్చతుర్థీముత్తరయాదత్తే" అనే మరోసూత్రము. మొదటిరోజునవటువునకు కట్టినబట్టను అనగా దీక్షావస్త్రమును ఆచార్యుడు నాల్గవరోజున విప్పి మరొకబట్టను కట్టవలెను. ఈ విధివాక్యం కూడా "ఉపనయనం 3 రోజులు చేసినపిమ్మట మేథాజననసంస్కారమును నాల్గవ రోజున చేయవలెను" అని నిర్దేశిస్తూంది. ఈమేథాజననం చేసిన పిమ్మటగాని 'ఉపనయనం' పూర్తికాదనిసూత్రకారుల ఆశయమున్నమాట. మరొకబలవత్తరవిషయమిది. మూడురోజుల మధ్యలో ఉపనయనాగ్ని నష్టమైనచో 'ప్రాయశ్చిత్తము' విధింపబడినది. ప్రాయశ్చిత్తము విధింపబడిన ప్రతికార్యము చెప్పినగడువువరకు అనివార్యముగా ఆచరించవలెను. పైన చెప్పిన బలవన్నిదర్శనములన్నియు ఉపనయనసంస్కారమును తప్పనిసరిగా 3 రోజులు చేయవలెనని శాసించుచున్నవి.

## -: ఉపనయనమునకు ముఖ్యకాలము :-

"గర్భాఽష్టమేషు బ్రాహ్మణ ముపనయీత"
(ఆపస్తంబ సూత్రం)

అనగా తల్లిగర్భములో ఉన్న 9 మాసములను కలిపి లెక్కచూచినచో వటువునకు 8వ సంవత్సరం రావలెను.

అనగా 7సం॥రముల 3 మాసములు + 9 గర్భమాసములు కలిపినచో 8వ సం॥రం వచ్చును.

దీనినే "గర్భాష్టమసంవత్సరం" అంటారు. ఇదియే ముఖ్యకాలము. ఇక 'గర్భాఽష్టమేషు' అనే బహువచన నిర్దేశమునుబట్టి 'గర్భషష్ఠ, గర్భసప్తమ, గర్భాఽష్టమ' అనేవిధంగా బహువచనమునకు అవసరమైన 3 సంఖ్య వస్తుంది. దీనినిబట్టి గర్భషష్ఠసంవత్సరం అనగా 5సంవత్సరాల 3మాసములకు గర్భగతమాసములు 9కలుపగా గర్భషష్ఠసంవత్సరం అనేది వస్తుంది. ఇదేవిధంగా గర్భసప్తమ, గర్భాఽష్టమ సంవత్సరాలు వస్తాయి. ఈవిధంగా బ్రాహ్మణబాలురకు 5సంవత్సరాల 3 మాసముల వయస్సు వచ్చినప్పటినుండి ఉపనయనమునకు ముఖ్యకాలము ప్రారంభమై వటువునకు 8వ సంవత్సరం ఆఖరువరకు యీముఖ్యకాలం ఉంటుందని తెలింది. ఇక ఉపనయనమునకు తుదిగడువు 16వ సంవత్సరం. ఈగడువుదాటినచో అట్టివటువునకు 'ఉపనయనము'నకు కూడా అర్హతయుండదని మనుస్మృతికారుడు యిలా చెప్పినాడు.

"ఆషోడశా ద్బ్రాహ్మణస్య అపతితా సావిత్రీ, అత ఊర్ధ్వం పతితసావిత్రీకా భవంతి, నైన ముపనయేత్...."

— మనుస్మృతి.

ఈస్మృతివాక్యాలలో 3 విషయాలు గమనార్హములు :

1. 16వ సంవత్సరం పూర్తికానంతవరకు వటువునకు గౌణపక్షంగా 'ఉపనయనము' చేయవచ్చును.



2. వటువునకు 16వ సంవత్సరంకూడా దాటినచో అట్టివటువు 'పతితసావిత్రీకు' డౌతాడు. అనగా అట్టివానికి—
3. గాయత్రీమంత్రోపదేశమునకు అర్హత నశిస్తుంది. అంటే అట్టివానికి ముఖ్యమంత్రోపదేశముచేసిన తండ్రికి దోషము కలుగుతుంది. కనుక 16సం॥లు దాటినవానికి 'ఉపనయము' చేయరాదని భావము.

## బ్రహ్మచర్యము.

"బ్రహ్మణి చరతీతి బ్రహ్మచారీ, తస్య భావః బ్రహ్మచర్యం" అని వ్యుత్పత్త్యర్థము. బ్రహ్మ అనగా వేదము.

"వేద స్తత్త్వం తపో బ్రహ్మ" అని నిఘంటువు.

ఇట్లు బ్రహ్మచారి తనబ్రహ్మచర్యవ్రతకాలమునంతను వేదాధ్యయనముతోనే గడపవలెనని 'బ్రహ్మచారి'పదం సాక్ష్యమిస్తుంది.

బ్రహ్మస్వరూపమైన వేదాధ్యయనప్రభావంవలన బ్రహ్మచారియొక్క మనస్సు పవిత్రభావభాసురమై, విశుద్ధమై క్రమంగా ఇంద్రియనిగ్రహం కలదౌతుంది. ఈ 'ఇంద్రియనిగ్రహం' అనేది బ్రహ్మచర్యానికి ప్రాణశక్తిని ప్రసాదిస్తుంది. ఈశక్తితో బ్రహ్మచారిమనస్సు నిశ్చలమై ఏ భౌతికవికారములకు లోనుగాకుండా ఉంటుంది. మనస్సు స్వాధీనమైనవానికి ప్రపంచమంతయు స్వాధీనమౌతుంది. ఇకమనస్సును సులభంగా చలింపజేసి స్వాధీనంచేసుకొనగలుగునది ఒక స్త్రీశక్తి మాత్రమే. ఈసందర్భంలో

ముఖ్యంగా స్మరింపదగినది 'భర్తృహరి' మహాకవియొక్క యీసుభాషితము-

కాంతాకటాక్షవిశిఖా నఖనంతి యస్య
చిత్తం న నిర్దహతి కోపకృశానుతాపః ।
తర్షంతి భూరివిషయాశ్చ న లోభపాశైః,
లోకత్రియం జయతి కృత్స్నమిదం స ధీరః ॥

-ధైర్యపద్ధతి 75శ్లో.

తా॥ ఎవనిమనస్సు కామినులచూపులనే బాణముల చేత ముక్కలుకాదో, ఎవనిహృదయమును కోపాగ్ని దహింపదో, ఎవనిమనస్సు అత్యాశఅనే పాశములచే లాగబడదో అట్టిధీరుడు ముల్లోకములను జయించగలడు. కనుక మీదిసుభాషితములో చెప్పబడినట్లు స్త్రీలు భౌతిక విషయాలు అనే వీటిసంబంధం బ్రహ్మచారికి ఏమాత్రం పనికిరాదు.

ఇంద్రియనిగ్రహం లేనివానికి తరచుగా 'వీర్యస్ఖలనం' జరుగుతూంటుంది. అపరిణామదశలో యీవీర్యంతాలూకు ఒకబిందువైనను పతనమైనచో ఆపతనమనేది మానవునికి మరణంతో సమానమైనదని-

"మరణం బిందుపాతేన, జీవితం బిందుధారణాత్ ।
తస్మా దతిప్రయత్నేన బిందుం రక్షే త్సదా బుధః ॥"

'వాగ్భటు' డనే ఆయుర్వేదాచార్యుడు 'శుశ్రితం' అనే తనసంహితాగ్రంథంలో చెప్పినాడు. ఈ ఆచార్యుడే తనసంహితాగ్రంథంలో చెప్పిన మరికొన్ని శ్లోకములభావ మిది-



మనశరీరంలో 'ఓజస్సు' లేక 'తేజస్సు' అనబడే యీశుక్రధాతువు ఉండుటచేతనే మననిత్యజీవితం ఆనందోత్సాహాలతో సక్రమంగా సాగుతూంది. ఇది-

A సప్తధాతువులలో శ్రేష్ఠమైనదీ, ముఖ్యమైనదీ కూడాను.

ఈశుక్రధాతువు మానవులహృదయభాగంలో ఉన్నను అదిమానవుల శరీరమంతా వ్యాపించి,జీవులుబ్రతికియుండుటకు మూలమౌతుంది. దీనివృద్ధిచేతనే మనశరీరాలకు తగినంత పుష్టి, తుష్టి, బలం, కాంతి, యవ్వనం, ఆనందం, ఉత్సాహం మొదలైన శక్తులు(ముఖ్యగుణాలు) అబ్బుతున్నాయి. ఈధాతువుయొక్క వృద్ధివలన మన మానసికభావాలుకూడా స్థిరసంకల్పం కలవౌతున్నాయి. మనలోని బుద్ధి, ప్రతిభ, ధైర్యం, శరీరసౌందర్యం, సుకుమారత అనే యివన్నీకూడా యీవీర్యధాతువునే ఆశ్రయించుకొని ఉన్నాయి. కనుక యీధాతుధారణమే మన శరీరధారణకు మూలమౌతుందని వాగ్భటుని ఆయుర్వేద గ్రంథం చాటిచెప్పింది. ఈగ్రంథరాజములోని ఒక సంస్కృతశ్లోక మిది-

"యథా పయసి సర్పిస్తు గుడ శ్చేక్షురసే యథా ।
ఏవం హి సకలే కాయే శుక్రం తిష్ఠతి దేహినాం ॥"

అనగా ఎక్కువపాలలో 'నెయ్యి' దాగియున్నట్లును, ఇట్లే చెరకురసంలో మనకు కనుపించకుండా 'బెల్లం' దాగి

---

A "రసాஉసృఙ్మాంసమేదోஉస్థిమజ్జాశుక్రాణి ధాతవః"

యున్నట్లును, జీవులశరీరమంతటిలో 'శుక్ర'(వీర్య)ధాతువు వ్యాపించియున్నదని మీది అమరభాషా శ్లోకమునకుఅర్థము. మీదచెప్పినవిధముగా బాలురకు వారిభావిజీవితమునకును, వికాసమునకును, వారిపూర్ణజీవితసిద్ధికిని ముఖ్యంగా కావలసిన సర్వవిధయోగ్యతలును, సర్వవిధశక్తులును శాస్త్రోక్తమైన "బ్రహ్మచర్యవ్రతనియమపాలనము" వలననే సిద్ధిస్తున్నవి. ఇంతటి మహోన్నతమైన బ్రహ్మచర్యమును గూర్చి సూత్రప్రాయంగా ఉన్న కొన్నివాక్యము లివి.

"బ్రహ్మచర్యము అనగా మనజీవితధారణమునకు మూలాధారమైన వీర్యసంరక్షణవిధానమే"

యని తెలుసుకొనవలెను.

మీదచెప్పిన విశిష్టవిషయమును ఉపనయన సుముహూర్తసమయమున చదువుచున్న వేదమంత్రము యొక్క అర్థము యిట్లు ఋజువుచేస్తూంది. ఈమంత్రమునకు చెందిన సూత్రమిది-

"ముహూర్తకాలే ఆత్మన స్సమీప మానయతి, సుప్రజా ఇతి దక్షిణే కర్ణే జపతి, తద్రహస్యం భవతి ।"

"సుప్రజాః ప్రజయా భూయాః సువీరో వీరైః సువర్చా వర్చసా సుపోషః పోషైః సుగృహో గృహైః....''

సుముహూర్త సమయంలో తండ్రి నూతనవటువుతో చెప్పిన విశిష్టవిషయ మిది- "కుమారా ! నీవు ఉత్తమ సంతానముతో సత్సంతానవంతుడవు కావలయును''.



కుమారునకు కుడిచెవిలో రహస్యముగా తండ్రి చెప్పిన విషయ మిది. ఈవిషయములో బ్రహ్మచర్యపాలనమునకు చెందిన విశిష్టఫలమంతయు విలీనమై యున్నది. ఎట్లనగా-"కుమారా ! గృహస్థాశ్రమములో నీవు ఉత్తమ సంతానమును కనుటకు మూలమైన బ్రహ్మచర్యవ్రతనియమపాలనమును, ఈవ్రతనియమపాలనకాలములోనే శాస్త్రోక్త విధానంలో పాటింపవలె" నని తండ్రిచెప్పిన ఉపదేశములోని ఆంతర్యము. వాగ్భటాచార్యుడు చెప్పినట్లు వటువు నియమాచరణముపూర్తిగాపాటించినచో అతని శుక్ర(వీర్య) ధాతువు సక్రమపరిణతినిచెంది అది అచిరభావికాలంలో అతని ఉత్తమసంతానప్రాప్తికి ఉత్తమసాధన మౌతుంది. అది క్రమంగా వంశదేశాభ్యుదయసాధన మౌతుందని తండ్రి వటువునకు రహస్యంగా చేసినఉపదేశంలోని ఆంతర్యం.

ఇక కుమారునకు తండ్రి గాయత్రీమహామంత్రమును ఉపదేశించిన పిమ్మట అతనిని లేవదీసి సూర్యపరమాత్మను అతనికి దర్శింపజేయాలి. ఆసందర్భంలో చెప్పే వేద మంత్ర మిది-

"ఉదా౨యుషాస్వా౨యుషోదోషధీనాగ్ం రసేనో త్పర్జన్యస్య శుష్మేణోదస్థా మమృతాగ్ం అను"

(వటువుతో తండ్రి చెప్పేమాట లివి)

తండ్రి గాయత్రీమహామంత్రమును వటువునకు ఉపదేశించిన వెంటనే అతడు వందలరెట్లధికముగా బరువెక్కుతాడు. అట్టికుమారుని అతడున్నచోటునుండి తండ్రి లేవదీయలేక కుమారునితో యిట్లంటాడు. “కుమారా! నిన్నిచ్చటనుండి లేవదీయుటకు నాజీవితకాలంలో గల ‘శక్తి’ నంతను ఒకచోటికి చేర్చి ప్రయత్నించినాకూడా నిన్ను లేవదీయలేకపోయాను. కనుక ఓషధులనుండి సంపాదించినశక్తిని నాసంపూర్ణశక్తికి జతచేసి ప్రయత్నించినా నిన్ను లేపదీయలేకపోతిని. కనుక మేఘములను ప్రార్థించి వాటినుండి గ్రహించిన రసజలరూపశక్తులను నాయావచ్ఛక్తితో జోడించి ఆమొత్తం శక్తితో నిన్నిట నుండి దేవతాసందర్శనమునకై లేవదీయుచున్నాను”. ఈ మంత్రార్థమువలన గాయత్రీమహామంత్రోపదేశమునకు ముందు వటువులోలేని యీఅద్భుతశక్తి ఆమహామంత్రోపదేశానంతరమందే వటువులో క్రొత్తగా ప్రవేశించినది. ఇందులకు ‘వీరమిత్రోదయము’ అనేధర్మశాస్త్రగ్రంథము ‘సంస్కార’శబ్దమునకు చెప్పిన నిర్వచనమే ప్రమాణము. వటువునకు తనయావజ్జీవితములోను కావలసిన శక్తులన్నీ యీ ‘ఉపనయనసంస్కారము’ వలననే సంపాదించవలసి యున్నవికదా!

## -: వి వా హ ము :-

నూతనవధూవరులకు వారిగృహస్థాశ్రమానికి సంబంధించినవిధులను, ధర్మాలను కన్యాదాత అగ్నిసన్నిధిలో



మంత్రసంస్కారసహితంగా వారికి ప్రబోధించే పవిత్ర సంస్కారవిశేషమే ‘వివాహ’ మని చెప్పబడును.

“విశేషేణ వాహయతీతి వివాహః”

అనే వివాహశబ్దవ్యుత్పత్త్యర్థంకూడా మీదివిషయమునే విశదంచేసినది. అట్లు అభ్యుదయప్రదములైన ఐహికాముష్మికప్రయోజనములతోకూడి నూతనవధూవరులలో అంతకుముందులేని పవిత్రశక్తులను, యోగ్యతలను వారిలో ఉదయింపజేసే శాస్త్రీయక్రియాకలాపానికే ‘వివాహము’ అనేపేరు చెల్లుతుందని సారాంశము.

## -: ధర్మయుతమైన అర్థకామముల శ్రేయస్కరత్వం :-

ధర్మాన్ని అనుసరించి ప్రవర్తిస్తూన్న అర్థకామముల శ్రేయస్కరత్వమునుగూర్చి ప్రత్యేకముగా ప్రబోధించిన మనమహర్షిపుంగవులప్రబోధాలలో “రమ్యరమణీయవిశ్వకళ్యాణకరవిశిష్టభావన” విశ్వచరిత్రలో విశ్వవంద్యంగా విరాజిల్లుతూనే ఉంటుంది. ఇట్లు మానవజాతికంతటికీ సర్వకాలసర్వావస్థలలో “హితంకరములు, ప్రియంకరములు, క్షేమంకరములు” అయిన మహర్షుల మహిత ప్రబోధాలను త్రోసిరాజుచేసి ప్రబలిన అర్థకామాలకు దాసులైనవారికి వినాశం పొంచియుంటుందనే సత్యాన్ని కౌరవ, రావణ, కీచకుల జీవితచరిత్రలు చరిత్రఉన్నంతకాలం ప్రపంచానికి చాటుతూనే ఉంటాయి. ఇట్లు ధర్మరహితమై ప్రబలిన అర్థకామాలవలన లోకమునకు దాపు

రిస్తున్న అనర్థపరంపరను బాగుగా తెలుసుకున్నవారు కనుకనే మనమహర్షులు వివాహంలో కన్యాదాతచేత నూతనవరునకు శాసనరూపంగా యిలా చెప్పించినారు.

దాతా– "ధర్మార్థకామేషు త్వయైషా నాఽతిచరితవ్యా"

ఓనూతనవరా ! వివాహానంతరం నీవీమెతోకూడి ధర్మ, అర్థ, కామపురుషార్థములను సమాఽనాదరభావంతో (అనగాసమానప్రాధాన్యభావంతోనే) నీవు సేవించవలెను (శాసనం). అంతేకాని అర్థకామాలనుమాత్రమే ప్రత్యేక శ్రద్ధతో సేవించరాదు (నిషేధం).

అంటే ఓనూతనవరా ! గృహస్థాశ్రమంలో నీవు సేవించబోయే అర్థకామాలు, ధర్మాన్ని పురస్కరించుకొని అధర్మంయొక్క అడుగుజాడలలోనే ప్రవర్తిల్లవలెను.

ఇట్లు మామచెప్పిన శాసననిషేధాలను వరుడు అంగీకరించి "నాఽతిచరామి" అని మామగారికి 'హామీ' ఇచ్చినపిమ్మటే మామ వరునికి కన్యాదానంచేస్తాడు. దీనిని బట్టి (కన్యాదాతభావంలో) ధర్మసహితంకాని విశృంఖల కామం మానవుల కనర్థప్రదమౌతుందనీ, ధర్మయుక్తమైన దంపతులకామం సత్సంతానప్రదమగుచు, అది క్రమంగా సాంఘిక దేశశ్రేయస్సంపాదనకు దివ్యసాధనమౌతుందనీ మామమాటవలన అభివ్యక్తమయింది.

ఇచ్చట ఒకపరమార్థము తెలుపవలసియున్నది.

వరుడు తాను వివాహంచేసుకొనడంలోగల తన ధ్యేయాన్ని తనముఖ్యస్నేహితులద్వారా కన్యాదాతకు



యిలా తెలుపుతాడు. నేను ప్రస్తుతంలో వివాహం చేసుకొనుటలోగల నాధ్యేయమిది. 1) వైవాహికధర్మాలను ఆచరించడము 2) ఉత్తమసంతానప్రాప్తి. ఈరెండు ధ్యేయములసిద్ధికొరకే ప్రస్తుతంలో వివాహం చేసుకొనదలచితిని. వరుని వివాహధ్యేయం విని కన్యాదాత సంతసించి వచ్చినవారితో–

"వృణీధ్వం తస్మై దాస్యామి"

(మీరుకోరిన ప్రకారంగా మీస్నేహితునకు మాఅమ్మాయిని యిచ్చెదను)అని కన్యాదాతచెప్పగనే వారువరునివద్దకువచ్చి "కృతార్థా వయమితి వరమావేదయేయుః" అనిచెబుతారు.

ఇట్లు "మానవుల కామపురుషార్థం ధర్మాన్ని పురస్కరించుకొనే ప్రవర్తిల్లవలెను" అనే భారతీయవైవాహిక ధర్మంలో ఉండే సత్యాన్ని పార్వతీదేవి పరిణయగాథ యిలా ప్రకాశింపజేసింది.

గిరిజాకుమారియొక్క శారీరకసౌందర్యం విశ్వాఽతీతమైనదని కాళిదాసకవీంద్రుడు వర్ణించినాడు. అంతటి ఆమె సౌందర్యం మన్మథుని సమ్మోహనాస్త్రం సహాయం ఉండికూడా ఆమెమహేశ్వరుని వశంచేసుకోలేకపోయింది.కారణం అప్పటి గిరిజయొక్క సౌందర్యం భౌతికమై ఉండటం, మహేశ్వరుడు ఆధ్యాత్మికశక్తి సంపన్నుడు కావటం. కనుక ఆగిరిజాకుమారి వ్యర్థమైన అప్పటితనభౌతిక సౌందర్యాన్ని కఠోరతపస్సు (గౌరీతపస్సు) చేసి ఆధ్యాత్మిక

సౌందర్యంగామలచుకొని అట్టిఆధ్యాత్మిక సౌందర్యశక్తితో మహేశ్వరుని ఆమెపతిగాచేసికొని, అప్పటితనపవిత్రప్రేమ శక్తితో మహేశ్వరుని అర్ధశరీరంలో నిత్యనివాసం కల్పించుకొనగలిగినది. అంటే ఆపరమేశ్వరునికి 'అర్ధాంగి' అయిందన్నమాట. ఆనాటి గౌరీతపస్సే నేటికీ మనకన్యకాజనంతమవివాహానికి మొదటచేసే 'గౌరీపూజ'గానిలిచింది. కాని ఆగిరిజాకుమారికి అబ్బిన 'అర్ధాంగి' ధర్మం మనకన్యకల 'గౌరీపూజ'లో కనబడదు. పిండికొద్దీ రొట్టెకదా! ఇంతకూ చెప్పేదేమంటే "భారతీయుల వైవాహికసంప్రదాయాలు" ఆధ్యాత్మికశక్తితో ఉత్తమోత్తమప్రయోజనాలు పొందుతుంటాయనీ, అంతటిప్రయోజనాలు పొందటానికి భారతీయవివాహ సంప్రదాయాలలో వారికామపురుషార్థం 'ధర్మం'తో కూడియుండటమే మూలకారణమని చెప్పక తప్పదు.

## కామప్రవృత్తి నిరోధాలు-మహర్షులమధ్యేమార్గము

భౌతికదృష్టిలో 'కామప్రవృత్తి' అనేది యౌవనసమయంలో ప్రతిప్రాణికీ సహజంగా ఉండేప్రవృత్తి. ఈసహజప్రవృత్తిని ఒక్కసారి బలవంతంగా నిరోధించడంవలన మానసికోన్మాదం(పిచ్చి), మూర్ఛవంటిభయంకరవ్యాధులు బయలుదేరుతాయనీ, అట్టివ్యాధులుకలవాడు ఏపనీచేయలేని హీన, దీనస్థితికి దిగజారుతాడనీమనస్తత్త్వశాస్త్రవేత్తలు చాటిచెప్పుచున్నారు. ఎంతటివారైనను యీకామప్రాబల్యాన్ని అణచుకోలేరు, అణచుకోలేముకూడా. లేముకదా అని



స్వేచ్ఛాకామప్రవృత్తిని గాలిపడవనువలె దానిస్వేచ్ఛాప్రవృత్తిలోనికి విచ్చలవిడిగా విడచిపెట్టనూరాదు. విడచిపెట్టితిమా ఆదుష్టకామవేగం అట్టివారిని సర్వవిధముల పతితులనుచేసి క్రమంగా నశింపజేస్తుంది. కనుక పూర్తిగా కామనిరోధంకాని, పూర్తిగా కామస్వేచ్ఛాప్రవృత్తిగాని మానవులకు ఏవిధంగానూ ఉపయోగించకపోవడమేకాక పైపెచ్చు అట్టిది అనేకవిధాలైన అనర్థాలకు ఆదికారణమౌతుంది. ఈలోకస్వభావాన్ని బాగుగా తెలుసుకున్నవారు కనుకనే మనఆర్యమహర్షులు ప్రబలకామాన్ని పూర్తిగా నిరోధించనూలేదు, స్వీకరించనూలేదు. ఇక మధ్యేమార్గంగా ఆకామాన్ని 'ధర్మం'తో జోడించి శుద్ధిచేసి దానిని లోకక్షేమంకరంగా మలచినారు.

## -: ధర్మయుతమైన కామం సృష్టికి మూలం :-

సృష్టివిధానమంతా 'కామం' పై ఆధారపడి యున్నట్లు వేదశాస్త్రవచనాలు చాటుతున్నాయి. కామం అనగా కోరిక అని కూడా అర్థం ఉన్నదికనుక యేవిధమగు పనిచేయవలెనన్నా ముందుగా ఆపనికి సంబంధించినకోరిక (కామం) మనలో జనించాలి. 'భార్య కావాలి' అనేకోరిక పుట్టినవాడే వివాహం చేసుకొనడం అనేపని ప్రారంభమౌతుంది. ఇట్లే "ధనం బాగుగా సంపాదించాలి" అనేకోరిక మనలో కలిగినప్పుడే ధనార్జనకు కావలసిన ప్రయత్నాలు చేయబడతాయి. ఈవిధంగా యీభౌతికప్రపంచంలో ప్రతిగంటలోనూ

జరిగే పనులన్నింటికీ ఆపనులకు సంబంధించిన కోరికలే మూలకారణా లౌతున్నాయి. తనకు,తనపితృదేవతలకుపుణ్య లోకప్రాప్తి కావాలనే కోరికచేతనే కన్యాదాత కన్యాదానమనే క్రియను వ్యయప్రయాసలకోర్చి చేయగలుగుచున్నాడు. కన్యాస్వీకర్త కూడ ముఖ్యంగా కామవాంఛాతృప్తి మూలక మైన సంతానప్రాప్తి కొరకే కన్యకను స్వీకరిస్తున్నాడు. కనుక కన్యకను దానంచేయడం, ప్రతిగ్రహించడం అనే రెండుపనులు కామమూలకాలే. పైనిదర్శనాలన్నీ జీవ సృష్టికీ, క్రియాసిద్ధికీ 'కామం' అనేది మూలమైయున్నట్లు ధృవపరుస్తున్నాయి. కాని యీకామంమాత్రం ధర్మయుతం కావాలిసుమండీ :

## -: ధర్మరహితమైన కామోద్రేకం అనర్థావహం :-

ఇట్టికామం స్వేచ్ఛాప్రవృత్తితో ప్రాబల్యం వహించి ఎప్పుడైతే ధర్మపురుషార్థాన్ని 'త్రోసిరాజు'చేస్తుందో అప్పుడు అట్టిప్రబలకామం మానవుని పతనానికీ, క్రమంగా అది అతనివినాశనానికీ ప్రత్యేకకారణమౌతుంది. రావణాసురుడు, కీచకుడు, దుర్యోధనుడువంటివారు ధర్మ రహితమైన అర్థానికీ, కామోద్రేకానికీ పూర్తిగా లొంగి పోవడంచేతనే వారిని మృత్యుదేవత యవ్వనదశలోనే వరించిందికదా ! అంటే వారికామం పూర్తిగా ధర్మరహితం కావడమే వారివినాశానికి మూలమైన దన్నమాట. ఈ సత్యాన్ని రుజువుపరచే లోకనిదర్శన మిది. మండోదరి



తనభర్తయగు రావణాసురుని వినాశం విని యిలా విల పిస్తుంది.

"ఇంద్రియాణి పురాజిత్వా జితం త్రిభువనం త్వయా ।
స్మరద్భి రివ తద్వైర మింద్రియై రేవ నిర్జితః ॥"

వాల్మీకిరామాయణం, యుద్ధకాండ.

"ఓపతిదేవా ! నీవు నీయింద్రియాలను నీస్వాధీ నంలో ఉంచుకొని నీకామపురుషార్థాన్ని ధర్మపూర్వక ముగా నడిపించినంతకాలము నీకు మూడులోకములను జయించడమనే అద్భుతకార్యసాధనం సాధ్యమైనది. ఇక నీవు కామోద్రేకానికి వశుడవై ధర్మమార్గాన్ని విడచిపెట్టి సీతాసాధ్విని యెప్పుడు అపహరించినావో ఆసమయమే నీనాశనమునకు 'నాంది' అయింది. నీనాశనక్రియకై పొంచియున్నట్లున్న నీయింద్రియాలచేతనే నాథా ! నీవు జయించబడి నడివయస్సులోనే నాశం పొందితివా ?" అని మండోదరి విలపిస్తుంది.

ఇది భూత, భవిష్యత్, వర్తమానకాలములలో మార్పులేని సత్యమని యీగీతాసూక్త్యర్థం యిలా చాటు తూంది.

"తనయింద్రియాలను జయించలేనివానికి వాని మనస్సుతో కూడిన వానియింద్రియాలే ప్రబలశత్రువు లౌతాయి. మనస్సును స్వాధీనం చేసుకొన్నవాని యింద్రి యాలే వానికి ఆత్మీయబంధువులవంటి వౌతాయి."

"బంధురాత్మాఽఽత్మన స్తస్య, యేనాత్మై వాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥"
—భగవద్గీత. 6-6

కనుక సృష్టికి మూలమైన పవిత్రప్రేమ కామోద్రేక రూపంలో దూషితము కాకూడదని, అట్టి దూషితకామం సృష్టివికాసానికి కాక, సృష్టివినాశానికే కారణమౌతుందనీ పైచర్చద్వారా రుజువయింది.

## -: ధర్మసహితమైన కామం :-

కామపురుషార్థం ధర్మపురుషార్థంతో కలిసి దాని అడుగుజాడలలో ప్రవర్తించినపుడే ధర్మసమలంకృతమైన అట్టికామం మానవుల దైనందినజీవితానికి మంగళదాయకమౌతుంది. అంటే ధర్మసహితమైన కామంవలన మానవులకు యేవిధమైన అనర్థంపుట్టదన్నమాట. అట్టిధర్మమూలకమైన కామంవలన జనించిన ప్రేమ స్త్రీపురుషుల అన్యోన్యాఽనురాగానికి మూలమౌతూ యెట్టిక్లిష్టపరిస్థితులలోను అట్టిది చెక్కుచెదరకుండా ఉంటుంది. దీనికి ముఖ్యనిదర్శనం సీతారాములప్రేమ. వీరిప్రేమకు మూలమైన వీరికామం వీరిస్వధర్మానికి విధేయమై ఉంది. ఎట్లనగా 'ప్రజానురంజనం' అనేది రాజుయొక్క ముఖ్యధర్మం. (రంజనా ద్రాజా భవతి) ఈధర్మాన్ని శ్రీరామచంద్రుడు యెట్టిపరిస్థితులలోను విడచిపెట్టలేదు. అసలు 'ప్రజారంజనం' అనేస్వీయధర్మసంరక్షణకొరకే శ్రీరాముడు



ప్రాణాధికమైన తనసీతాదేవిని అడవిలోనికి పంపినాడు. పతియొక్క పవిత్రప్రేమలోని తత్వాన్ని తెలుసుకొన్నది కనుకనే ఆసాధ్వీమతల్లి అడవులపాలు జేయబడియుండి కూడా భర్తకు లక్ష్మణునిద్వారా యిలావార్త పంపుతుంది.

"తిరిగి నాఅరణ్యవాసానికి నాకర్మే కారణంకాని, శ్రీరామచంద్రుడు కారణంకాదు. కనుక తనకై దుఃఖించక శ్రీరామచక్రవర్తి ప్రజారంజనరూపస్వధర్మాన్ని నిర్విఘ్నంగా కొనసాగించవలెను" అని సీతాదేవి తనమాటగా తనప్రాణేశ్వరునికి విన్నవించుమని లక్ష్మణుని వేడుకొంటుంది.

దీనినిబట్టి అడవులలో విడచిపెట్టబడిన సీతాదేవియొక్క పవిత్రపతిప్రేమ కారడవులపాలు చేయబడినప్పుడుకూడ చెక్కుచెదరలేదన్నమాట. దీనికి ముఖ్యకారణం సీతాదేవియొక్క కామం 'పాతివ్రత్యం' అనే ఆమె ధర్మానికి వశమై ఉండడమే. ఇట్లే అడవులలో సీతను దిగవిడిచినప్పుడుకూడా-

ఆసీతకై శ్రీరాముడు విలపించడంచేత, అట్టివిషమసన్నివేశములోకూడా శ్రీరాముని పత్నీప్రేమ ప్రవృద్ధమే అయినది. దీనికికారణం శ్రీరామునికామం 'ప్రజారంజనం' అనే రాజధర్మానికి వశమైయున్నది కనుక-

ఇట్లు భార్యాభర్తలకామం వారివారి ధర్మాలకు అధీనమై, ధర్మంయొక్క అడుగుజాడలలో నడచుకొనడం

చేతనే ఆఆదర్శదంపతుల పవిత్రప్రేమను ఏవిషమకర సన్నివేశము చలింపజేయలేకపోయింది. లౌకికప్రపంచములోని దంపతులయొక్క కామంకూడా సీతారాములకామంవలె వారివారిధర్మాలకు వశమై ఆ'ధర్మాన్ని' అనుసరించి ప్రవర్తించిననాడు అట్టిదంపతులకు అట్టి ధర్మయుతకామం శ్రేయస్కరమే ఔతుంది. ఇది త్రికాలాబాధ్యమైన సత్యం.

మీద తెలిపినవిధంగా 'కామపురుషార్థం' యొక్క స్వరూపస్వభావాలను వేలాదిసంవత్సరాలకు పూర్వమే పూర్తిగా తెలుసుకొన్న మనమహర్షులు ఆకామాన్ని పూర్తిగా నిరోధించనూలేదు, ఆప్రబలకామవేగానికి మానవుని దాసునిగా చేయనూలేదు. ఇక ఆమహనీయులు సర్వవిధవిషమసమస్యలకు పరిష్కారమార్గంగా ఉండేటట్లు మధ్యేమార్గంగా "కామాన్ని ధర్మబద్ధం" చేశారు. దీనితో ప్రబలకామంయొక్క విషమవిశృంఖలత్వవేగం అంతా విలుప్తమై ఆకామం సంఘశ్రేయస్సంపాదనకు సమర్థమైన చక్కని సాధనంగా తయారైనది.

శుద్ధిచేయబడిన 'నాభి' (ప్రత్యేకముగా సేవించినచో ప్రాణాపాయకరమైన వస్తువు) కూడా అందరకు ఆరోగ్యప్రదమౌతుందికదా!

ఇట్లు సంస్కారాలన్నింటిలో ఆద్యమనిపించుకొన్న 'గర్భాధాన' సంస్కారానికికూడా 'వివాహసంస్కారం' మూలమైయుండుటచేతనే, యీవివాహసంస్కారంయొక్క ప్రత్యేకత, ప్రాధాన్యప్రభావాలు ప్రకాశితములౌతున్నాయి.



## -: స్త్రీకి 'ధర్మపత్ని' పదవీప్రాప్తి :-

స్త్రీకి సప్తపదీ సంస్కారంలో 'ధర్మపత్ని' అనేపేరు (యోగ్యత) ప్రాప్తిస్తుంది. ఈ విషయం వివాహసంస్కారం యొక్క ధర్మప్రాధాన్యమును రుజువుపరుస్తూంది.

ఇక 'సంస్కారరత్నమాల' అనే ధర్మశాస్త్రగ్రంథంలోని మొదటిసూత్రం యిది-

"వివాహస్య ఫలం దేవపిత్రర్ణాఽపాకరణం"

అనగా దేవఋణాన్ని, పితరులఋణాన్ని పూర్తిగా తీర్చివేయడమనేదే వివాహమునకు ఫలము. ఈవిషయాన్నే యజుర్వేదమంత్రం యిలా వివరించింది.

"ఓమ్ జాయమానో వై బ్రాహ్మణః త్రిభిర్ ఋణవా జాయతే, బ్రహ్మచర్యేణ ఋషిభ్యో, యజ్ఞేన దేవేభ్యః, ప్రజయా పితృభ్య ఏషవా అనృణో యః పుత్రీయజ్వా బ్రహ్మచారివాసీ...."

అనగా బ్రాహ్మణుడు పుట్టుకతోనే మూడుఋణములతో పుడతాడు. ఆఋణములను తీర్చేవిధాన మెట్లనగా శాస్త్రోక్తంగా 'బ్రహ్మచర్యవ్రతము'ను ఆచరిస్తే 'ఋషిఋణం' తీరిపోతుంది. A ధర్మపత్నితోకూడి వేదోక్తరీతిలో 'యజ్ఞం' చేస్తే 'దేవఋణం' తీరిపోతుంది. ఇకమూడవ

A "అయజ్ఞో వా ఏషః యోఽపత్నీకః" అనగా ధర్మపత్నిలేనివానికి యజ్ఞనిర్వహణాఽధికారం లేదనడానికి శ్రుతిప్రమాణం యిది.

దైన 'పితృఋణం' 'ఉత్తమసంతానప్రాప్తి'చేతనే తీరిపోతుంది. ఈవిధంగా యీమూడుఋణాలు తీర్చిన బ్రాహ్మణుడే ఋణశేషం లేనివాడౌతాడు.

ఇక 'హిందూవివాహము' అనే వ్యాససంపుటిలోని డా॥ శ్రీ మల్లాది గోపాలకృష్ణశర్మగారి 'భారతీయవివాహవ్యవస్థ' అనువ్యాసమునుండి కొన్నివాక్యముల నిట పొందుపరచుచున్నాను. (చూ. 145 పేజీ) గృహస్థాశ్రమమును గూర్చిన నొక వ్యాఖ్యాయిక భారతమున నిట్లు కలదు. పూర్వము 'యాయావర' వంశమున 'జరత్కారు' వను ఒకఋషి జన్మించెను. అతడు మహాతపస్వియును, ధర్మజ్ఞుడును, ఊర్ధ్వరేతస్కుడును, బ్రహ్మచారియునై యుండెను. అతడు దేశయాత్రకు బయలుదేరి యెక్కడ సాయంకాలమైన అక్కడ వసించుచుండెను. అతడు ఆయాతీర్థములను తిరుగాడుచు తీవ్రతపములచేతను, వ్రతములచేతను శరీరమును శుష్కింపజేయుచుండెను. అతడు వాయుభక్షియై ఆయాతీర్థములందు సంచరిస్తూ అతడొకచోట ఒకానొకగర్తమున తలక్రిందులుగా వ్రేలాడుచున్న తనపితరులను చూచెను. వారినిచూచి అతడు వారినిగూర్చియు, వారట్లు వ్రేలాడవలసిన దుఃస్థితికి గల కారణములను గూర్చియు సరయుగా వారిట్లు సమాధాన మొసగిరి.



''మేము తీవ్రతపములను సల్పిన 'యాయావర' వంశ మునులము. మాసంతానపరంపర సమాప్తము కాబోవుచుండుటచే పితృలోకమున మాకుగల స్థానము నుండి భ్రష్టులమై యీభూమిపై పడబోవుచున్నాము. మాసంతానపరంపరలో నిపుడొకడే యున్నాడు. అతనిపేరు 'జరత్కారువు' కాని అతడు సంతానప్రాప్తికై దారసంగ్రహముచేయక మిక్కిలి మూర్ఖతతో ప్రవర్తించుచున్నాడు. నాయనా, మాదుఃస్థితిపై జాలిగొను నీవెవ్వరవో తెలుప గోరెదము" అనగా తనపితరులకు తనపరిచయమును తెలిపి వారిని తానెట్లు ఉద్ధరింపగలనో తెల్పుమని ప్రార్థించెను. అపుడు పితరు లిట్లనిరి.

"నాయనా ! నీవు మనవంశపరంపరను సీతో ఉత్పన్నం గానీయక దారసంగ్రహముచేసి మమ్ముల నుద్ధరింపుము. దీనివలన మేము ఉద్ధరింపబడుటయేగాక నీవుకూడ స్వధర్మమును పాలించినవాడ వగుదువు. నాయనా ! ఇతరధర్మఫలములమూలమునగాని, పెక్కుకాలములు తపోవ్రతాదులను సలుపుటవలనగాని పుత్రవంతులకు వచ్చు నుత్తమగతులు సంప్రాప్తములుగావు. కావున నీవు దారసంగ్రహముచేసి సంతానమును గని మమ్ముల నుద్ధరింపుము." అపు డతడు వారియాజ్ఞపై వాసుకి చెల్లెలగు 'జరత్కారువు'ను వివాహమాడి, 'ఆస్తీకమహర్షి'ని కనెనని భారతగాథ.

అందువలననే శ్రుతి యిట్లు చెప్పుచున్నది.

"సోఽయం పితృలోకః పుత్రేణైవ జయ్యో నాఽన్యేన కర్మణా"

తా॥ ఈపితృలోకము పుత్రసంతానప్రాప్తివలననే జయింపదగినది. ఇతరములగు కర్మలవలనను, వేనివలనను యిదివశముకాదు.

పైశ్రుతిభావమునే భారతములోని 'జరత్కారువు' కథ వివరించుచున్నది. 'సంతానప్రేమ' యనునది సర్వప్రాణిసహజము. కాని వంశోన్నతినిగూర్చిన కోరిక మాత్రము కేవలము మానవసమాజమునకు మాత్రమే పరిమితము.

కనుకనే చాలమంది మహర్షులు 'గృహస్థాశ్రమము' సంతానప్రాప్తి కొరకేయని వచించియున్నారు. కనుకమానవసహజమగు సంతానప్రేమ వంశోన్నతికి సంబంధించిన గాఢమగు కోరిక. వివాహమునకు ప్రముఖకారణములను పేర్కొనుట శాస్త్రసంగతము, హేతుసంగతముకూడ. (ఇంతవరకు శ్రీగోపాలకృష్ణశర్మగారి వాక్యములు148వపేజీ)

## -: సప్తపది :-

'వివాహసంస్కారం' అనే ముత్యాలహారంలో 'సప్తపదీసంస్కారం' అనేది నాయకమణివంటిది. ఈసంస్కారంలో వరుడు వధువుయొక్క చేతినిపట్టుకొని అగ్నిసన్నిధిలో సమంత్రకముగా ఆరునొక్క అడుగులు నడి



పిస్తాడు. ఒక్కొక్కఅడుగును వేయిస్తూ వరుడు దాంపత్యజీవితంలో తమకు వలసిన ముఖ్యసంపదలను అనుగ్రహించుమని విష్ణుపరమాత్మను అర్థిస్తాడు.

మొదటిమంత్రం యిది- (ఇవి వరునిమాటలు)

"ఏకమిషే విష్ణు స్త్వాఽన్వేతు"

అనగా "ఓకల్యాణీ! నీవువేసిన మొదటిఅడుగునకు ఫలరూపంగా విష్ణుపరమాత్మ అన్నసమృద్ధితో నిన్ను అనుగ్రహించుగాక!" అన్నసమృద్ధిఉంటే అన్నిసమృద్ధులు ఉన్నట్లేకదా!

రెండవమంత్రం యిది-

"ద్వే ఊర్జే విష్ణు స్త్వాఽన్వేతు"

"ఓకళ్యాణీ! నీరెండవఅడుగునకు ఫలరూపంగా విష్ణుపరమాత్మ మనకు ఆరోగ్యబలసంపదలను అనుగ్రహించుగాక!" అన్నసమృద్ధిని అనుభవించుటకు ఆరోగ్యబలము లపేక్షితాలుగదా!

ఇక మిగతావి వైవాహికధర్మాచరణకు సంబంధించినవి. ఇక వధువు 7వ అడుగు వేయగానే తండ్రిగోత్రాన్ని విడచిపెట్టి భర్తగోత్రంలో ప్రవేశిస్తుంది. ఇందులకు ప్రమాణము-

"స్వగోత్రాత్ భ్రశ్యతే నారీ వివాహే త్సప్తమేపదే"

భర్తగోత్రంలో ప్రవేశించగానే అనూత్నవధువునకు భర్తయొక్క మానసికభావాలయందు ఆత్మీయత,

ఆదరభావముఅనేవి అబ్బుతాయి. ఇట్టి అద్భుతపరిణామశక్తి ఒక్కవైదికసంస్కారములకే ఉన్నదికాని మరిదేనికీ లేదు. కనుకనే 7వ అడుగు వేయడం తడవుగానే సంస్కారసంస్కృతమైన ఆ 'సప్తమపదము' ఆమెలో అప్పటికప్పుడు అంతటి అద్భుతభావపరిణామాన్ని కలిగించగలిగినది. భౌతికవిషయాలకు యీశక్తిలేదని అందరూ అంగీకరించక తప్పనిసరి ఔతుంది.

ఈసప్తపదీసంస్కారంలోని మరొకమంత్ర మిది-

"ఇద మహం యా త్వయి పతిఘ్నీ అలక్ష్మీ స్తాం నిర్దిశామి"

అనగా "ఓకళ్యాణీ ! నీపతికినష్టం కలిగించే అలక్ష్మిరూపమైన ఏదోషముకలదో ఆదోషాన్ని యీదర్భలతో నీపాపిడిగుండా తుడిచి తొలగిస్తున్నాను" అనిచెప్పి ఆ అలక్ష్మిని వరుడు తొలగిస్తాడు. దీనితో ఆనూతనవధువులోని దోషంపోయి ఆమెమనస్సు నిర్మలమై భర్తతోకూడి తానుచేయబోయే వైదికక్రియలను శ్రద్ధాభక్తులతో చేయగల్గుతుంది.

ఇక బండికాడియొక్క రంధ్రంలో మంగళసూత్రములుపెట్టి ఆసూత్రములద్వారా వరుడు వధువుపై ఉదకమును స్రవింపజేస్తాడు. ఎందుకనగా పూర్వకాలంలో 'అపాల' అనే అమ్మాయి కురూపంతో ఉండి, 'ఇంద్రుణ్ణి తనకురూపాన్ని పోగొట్టు'మని భక్తితో ప్రార్థింపగా



ఆఇంద్రుడు తనరథచక్రం ఆకులమధ్యనుండి ఉదకం ఆ కురూపిపై పడునట్లు 3 సార్లు స్రవింపజేయడంతో ఆమె సూర్యవర్చస్సు కలదౌతుంది. ఆమంత్రభాగం యిది-

"అపాలా మింద్రః త్రిః పూర్త్వ్యకరత్ సూర్య వర్చసమ్"

కనుక నూతనవధువు శరీరానికి చెందిన దోషాలను యీసంస్కారం తొలగిస్తుందని నమ్మకం. ప్రస్తుతం యీ క్రియను 'సంస్కారశబ్దానికి' సమన్వయించుకుందాం. 'అపాల'అనే ఆకుమారిలో మొదట కురూపం అనేదోషం ఉంది. ఆదోషాన్ని రథచక్రంలోంచి ఆమెపై పడునట్లు నీటిని స్రవింపజేయటం అనేసంస్కారం ఆమెకురూపం అనేదోషాన్ని మొదటపోగొట్టి ఆమెలో అంతకుముందులేని 'సూర్యవర్చస్సు' అనే నూతనశక్తిని ఆసంస్కారం ఆమెలో ప్రవేశపెట్టింది. ఈవిధంగా మానవులలో ఉన్న దోషాలను మొదటపోగొట్టి పిమ్మట అంతవరకూ వారిలో లేని క్రొత్తశక్తులను వారిలో ప్రవేశపెట్టగలిగినవాటికే 'సంస్కారములు' అనేపేరు చెల్లుతుందని 'వీరమిత్రోదయ' నామకగ్రంథంలోని 'సంస్కార' శబ్దనిర్వచనసందర్భంలో తెలుసుకున్నాం. ఇట్టి సంస్కారాలకు చెందినఘట్టాలు 'వివాహసంస్కారం'లో మరెన్నో ఉన్నాయి.

## -: భార్యాభర్తృత్వసిద్ధి :-

'సప్తపదీసంస్కారం' జరపడానికిముందు వధూవరులలో స్త్రీ-పురుషులు అనేధర్మం మాత్రమే ఉంది. కాని

వధువు వరునిసహాయంతో అగ్నిసన్నిధిలో సమంత్రక ముగా 7వ అడుగు వేయగానే వధువునకు 'భార్యాత్వము', వరునకు 'భర్తృత్వము' అనే క్రొత్తయోగ్యతలు (ధర్మాలు), శక్తులు ఏర్పడినవి. ఈపరమార్థాన్ని తెలిపే స్మృతిప్రమాణం యిది–

"నోదకేన నవా వాచా కన్యాయాః పతి రుచ్యతే।
పాణిగ్రహణసంస్కారాత్ పతిత్వం సప్తమే పదే॥"

దీనికి తాత్పర్య మిది– ఫలానావానికి మాకన్యక నిస్తాము అనిచెప్పినంతమాత్రానికే (అనగాఅంగీకారవాక్యం మాత్రం చేతనే) అతడు కన్యకకు పతికాజాలడు. ఇట్లేతండ్రి ఉదకధారాపూర్వకముగా ఫలానావానికి మాఅమ్మాయి నిస్తోమని చెప్పినాకూడా అతడు ఆమెకు 'పతి' కాజాలడు. ఇక అగ్ని సన్నిధిలో మంత్రసంస్కారపూర్వకముగా వరుడు వధువుయొక్క 'పాణిగ్రహణసంస్కారం'చేసి అగ్నిసాక్షికముగా వధువును ఆరున్నొక్కఅడుగులు నడిపించిననాడే వరునిలో 'పతిత్వ' రూపధర్మం, వధువులో 'పత్నీత్వ'రూప ధర్మం ఏర్పడుతుంది. ఈ'పతిపత్నీత్వ' రూపధర్మమే వధూవరులకు 'భార్యాభర్తృత్వసిద్ధిని' చేకూరుస్తుంది. ఈ'పత్నీత్వసిద్ధి'వలన వధువునకు భర్త ఆస్తులను చెరిసమానంగా అనుభవించే హక్కు భార్యకు ఏర్పడుట అనేది యీ 'సప్తపది'లోనే జరుగుతుంది. ఈవైదికసత్యాన్ని ఒకలౌకికనిదర్శనం యిలా రుజువు చేస్తుంది. సుమారుగా యిప్పటికి 30 ఏండ్లక్రితం నాటి



[illegible]. పెండ్లిలోనే కాపురంచెడి కోర్టుకెక్కిన స్త్రీని అప్పటి [illegible]ధికారి "నీవివాహము సప్తపదీసంస్కారం వరకు జరిగిందా ? లేదా ? అని అడిగి ఆసంస్కారం జరిగినపక్షం లోనే అట్టిస్త్రీకి భర్త ఆస్తిపై హక్కుఏర్పడుతుంది అని ఆ న్యాయాధికారి తీర్పు ఇస్తుండేవాడు"అని అ[illegible]లు చెప్పగా విన్నాను. ఈలౌకికనిదర్శనానికి మూలమైన పరలోక శాస్త్రీయనిదర్శనం యిది.

"పత్యుర్నో యజ్ఞసంయోగే" వ్యాకరణసూత్రం (4-1-33)

ఈసూత్రవివరణ మిది–

పతిశబ్దస్య నకారాऽऽదేశస్స్యాత్ యజ్ఞేన సంబంధే।
A 'వసిష్ఠస్య పత్నీ' తత్కర్తృకయజ్ఞ[illegible]భోక్త్రీత్యర్థః దంపత్యోః సహాధికారాత్।

సూత్రవివరణమునకు అర్థ మిది.

యజ్ఞంతో సంబంధం ఉన్నప్పుడే పతిశబ్దం 'పత్ని'గా మారుతుంది. ఇక యజ్ఞంతో సంబంధమును [illegible]–

"సప్త సప్తభ్యో హోత్రాభ్యో విష్ణుస్త్వాऽన్వేతు"
ఈవేదమంత్రంయొక్క భావ మిది–

---

'వసిష్ఠస్య పత్నీ' అనునపుడు పైవిధంగా యజ్ఞ సంబంధం ఉండుటచేత ఆవసిష్ఠపత్నికి భర్త చేసే యజ్ఞఫలమును అనుభవించే యోగ్యత అబ్బినది.

నీఆరున్నొక్కటవ (7వ) అడుగు ఓకళ్యాణీ : 'సప్త హోత్రలు' అనేవారు ముఖ్యులుగాగల యజ్ఞమును నిర్వ హించే యోగ్యతను తద్వారా పత్నీత్వయోగ్యతను (యీ 7వ అడుగు) నీకు కలిగించుగాక : దీనితో యీ యజ్ఞసంబంధం అనేది స్త్రీకి పత్నీత్వాన్ని కల్పించింది. ఇది యజ్ఞసంబంధం ఉన్నప్పుడు పతిశబ్దం B 'పత్నీ'గా మారడమంటేను. ఈవిధంగా వివాహానికి పరమప్రయోజన మైన 'భార్యాభర్తృత్వసిద్ధి', 'ధర్మపత్నీత్వసిద్ధి' అనేవి యీసప్తపదీసంస్కారంలోనే సంప్రాప్తము లగుచున్నవి.

అద్భుతమైన యీపరిణామమును (మార్పును) చేయగలిగినది ఒక్క ''సప్తపదీసంస్కారము'' మాత్రమే యని రుజువయింది.

## సప్తపదీ సంస్కారములోని ముఖ్యమంత్రము

"సఖా సప్తపదా భవ సఖాయౌ సప్తపదా బభూవ, సఖ్యంతే గమేయం సఖ్యాత్తేమాయోషం, సఖ్యాన్మే మాయోష్ఠా స్సమయావ సంకల్పావహై సంప్రియౌ, రోచిష్ణూ సుమనస్య మానౌ, ఇష మూర్జ మభిసంవసానౌ, సంనౌమనాగ్ంసి సముచిత్తాన్యాకరం...."

---

B పత్నీత్వసిద్ధిచేత భర్త ఆస్తిని చెరిసమానంగా అను భవించే హక్కు భార్యకు ఉన్నదికదా : ఈవిషయాన్నే "దంపత్యో స్సహాధికారాత్'' అనువాక్యం అభివ్యక్తం చేసింది.



(దీని తరువాతగల కొన్నిమంత్రముల భావాన్ని సంగ్రహంగా తెలుపుతాను)

1. "ద్యౌ రహం పృథివీ త్వం...."

ఓకళ్యాణీ : నేనుస్వర్గమువంటివాడను. నీవు పృథివి వంటిదానవు. ఈస్వర్లోకభూలోకములకుగల సంబంధం వంటి సంబంధమే మనయిరువురిమధ్యఉండవలెను. ఎట్లన-భూలోకంలో శాస్త్రీయంగా యజ్ఞములు జరిగినప్పుడు ఆ యజ్ఞాగ్నిలో హోమంచేసిన ద్రవ్యాలు దేవతలకు ఆహార ద్రవ్యాలుగా ఉపయోగిస్తాయి. దేవతలకు 'క్రతుభుజులు' అనేమరొకపేరుంది. అంటే మానవలోకంలో జరిగే క్రతువుల ద్వారా దేవతలకు భోజనం దొరుకుతుంది. కనుక భూలో కంలో జరుగుచున్నయజ్ఞములద్వారా దేవతలు సంతృ ప్తులై ఆసంతృప్తికి ఫలరూపంగా మంచివర్షాలు భూలో కంలో కురిపిస్తారు. ఆసకాలవర్షాలచేత మనదేశంసుభిక్షంగా తయారై అందరు సంపన్నులౌతారు. ఈసందర్భంలో కాళిదాసకవీంద్రుడు తనరఘువంశకావ్యంలో-

"దుదోహ గాం సయజ్ఞాయ సస్యాయ మఘవా దివం ।
సంపద్వినిమయే నోభౌ దధతు ర్భువనద్వయం ॥"
(సర్గ.1-శ్లో26)

అనగా రఘుమహారాజు పన్నులద్వారా వసూలైన ధనసంపదను యజ్ఞయాగాదులకు వినియోగించడం ద్వారా స్వర్గలోకవాసులకు ఆహారప్రదానం ద్వారా

సంతృప్తిని కలిగిస్తున్నాడు. అంటే భూలోకంలో జరిగే క్రతువులద్వారానే వారికి కావలసినంత ఆహారం దొరుకుతుందికదా ! కనుకనే వారికి 'క్రతుభుజులు' అనిపేరు. ఇట్లుభూలోకం ద్వారా వారికి కలిగిన సంతృప్తికి ఫలరూపంగా ఇంద్రుడు 'స్వర్గలోకసంపద' అనదగిన గొప్ప వర్షాలను కురిపించి భూలోకమును సుభిక్షంగా చేస్తున్నాడు. ఇట్లు భూలోకప్రభువైన రఘుమహారాజు తన భూలోకసంపదను (యజ్ఞములద్వారా) స్వర్లోకమునకు వినియోగించగా స్వర్లోకాధిపతియైన ఇంద్రుడు తన లోకసంపదను భూలోకమునకు వర్షరూపంలో వినియోగించి ఇట్లిద్దరుప్రభువులును స్వర్భూలోకాలనునిలబెట్టుకొనుచున్నారట. అనగా పరస్పర సహకారభావంతో 2 లోకాలు సుభిక్షంగా వెలసినవి. ప్రస్తుతం వరుడు స్వర్లోకంవంటివాడు కాగా వధువు భూలోకంవంటిది కదా ! వరుడు వధువు యొక్క శ్రేయస్సును కోరినపుడు ఆమె వరుని శ్రేయస్సంపాదనకొరకు సహజంగానే ప్రవర్తిస్తుంది, ప్రయత్నిస్తుందికూడాను. అటువంటప్పుడు పరస్పర సహకార ప్రభావంతో వధూవరులు స్వర్భూలోకములవలె సర్వవిధ శ్రేయస్సులతో తులతూగుతూంటారని ఆమంత్రంలోని భావం. ఈవిధంగా వధూవరుల మధ్య స్వర్భూలోకముల మధ్యగల సంబంధంవంటి సంబంధం ఉండాలని వరుని ఆకాంక్ష.



2. "మనోఽహ మస్మి వాక్ త్వం...."
అనేమంత్రానికి అర్థం.

ఓకళ్యాణీ ! నేను మనస్సువంటివాడను. నీవువాక్కువంటిదానవు. 'మనస్సు, వాక్కు'లకుగల సంబంధంవంటి సంబంధమే మనయిద్దరిమధ్య ఉండవలెను.

లోకంలో మానవుల మనస్సు సంకల్పించిన భావాలనే వారివాక్కులు ఉన్నవి ఉన్నట్లుగా బయటపెడతాయి. ఇట్లే సర్వవిధాలా భర్తభావాలను అనుసరిస్తూ, అనుకరిస్తూ భార్య ఉండాలని వరుని ఆకాంక్ష.

3. "సామాఽహ మస్మి ఋక్ త్వం...."
అనేమంత్రానికి అర్థం.

ఓకళ్యాణీ ! నేను సామవేదంవంటివాడను. నీవు ఋగ్వేదంవంటిదానవు. ఈరెండువేదముల మధ్యగల సంబంధంవంటి సంబంధమే మనఇద్దరిలో ఉండవలెను. పై సంబంధమును తెలిపే మంత్రంలోని భావ మిది-

యజ్ఞంలో ఒకచోట కొన్నిసామవేదమంత్రములను పఠించవలసియున్నది. ఆసామమంత్రములను పఠించడంవలన కలిగిన ఫలం ఆరాష్ట్రంలోని ప్రజలందరికీ అన్నసమృద్ధిని కలిగించడానికి కమనీయకారణ మౌతుంది. ఇట్లే యజ్ఞంలో మరొకచోట ఋగ్వేదమంత్రములను ఋత్విక్కులు పఠించవలసియున్నది.ఆఋగ్వేదమంత్రములనుపఠించుట వలన కలిగినఫలం (కర్త) ఆరాష్ట్రంలోని ప్రజలందరికినీ

ఆయురారోగ్యైశ్వర్యములను అమరజేయగలిగియున్నది. ఇప్పుడు గ్రహించండి. "ఋక్సాములు" అనే రెండు వేదములు కలిసినప్పుడే ఆరెండింటికి ఫలరూపములైన అన్నఆరోగ్యాదిసంపదలు కలిసి మానవులకు 'తృప్తి', 'ఆనందములు' అనే అఖండానందమును కలిగించినట్లు ఆరెండువేదములవంటివారై ఐక్యభావభాసితులైన దంపతులు కలిసియున్న సంసారంలో సంపూర్ణానందజనకములైన సర్వవిధసంపదలు తాండవమాడుచుండు నన్నమాట. దంపతులు అనగా 'భార్యాభర్తలు' లేక 'ధర్మపత్నీపతులు' మొట్టమొదట 'స్త్రీ-పురుషులు'గా అనగా సామాన్యమానవులుగా వ్యవహరింపబడుచున్న వీరికి ఇంతటి మహాఽభ్యుదయమును అమరజేసినది. అనగా 'భార్యాభర్తృత్వసిద్ధి' ప్రదానంచేసి, వారికి పురుషుని ఆస్తిలో సగం ఆస్తిపై 'హక్కు'ను అమరజేసినది ఒక్క 'సప్తపదీసంస్కారమే' కదా ! అద్భుతము, అనిదంపూర్వము అయిన యింతటి పరిణామమును కలుగజేయుడమనేది ఒక్కసప్తపదీసంస్కారమునకే సాధ్యంకాని ప్రపంచంలో మరిదేనికీ సాధ్యంకాదు. దంపతులకు "ఉత్తమసంతానప్రదానసిద్ధి" ద్వారా తల్లిదండ్రులకు మోక్షప్రదానసిద్ధినికూడా 'ఈసంస్కారరాజమే' సిద్ధింపజేసినది. ఈసంస్కారనిర్వహణంతోమహేశ్వరస్వరూపుడైన 'పతి' ప్రక్కనే కూర్చుండి, అతడు నిర్వహించిన యజ్ఞ



సంబంధమైన ఫలమును అనుభవించగలయోగ్యతను పతికి సంపాదించడమనేది సామాన్యవిషయమా ? స్త్రీకి అంతకుముందులేని యీమహోన్నతపదవులు. యీసంస్కారనిర్వహణోత్తరక్షణమందే ఆమెకు అబ్బడమనేది మహాశ్చర్యజనకముకాదా ?



## -: ఆధ్యాత్మికసమన్వయము :-

ఇక నామొదటిరచన అయిన 'కాళిదాసహృదయము' అనుగ్రంథమునుండి కొన్ని విశిష్టవిషయములను ప్రస్తావింపదలచితిని. అవిప్రస్తుతవిషయములకుసంబంధించినవి.

"శకుంతల వృక్షములకు ముందు జలము లిడిన పిమ్మటనే తాను త్రాగును. లతలకు నొప్పికలుగునని వాని కిసాలయమైనను త్రుంపదు. గిరిజయు తనతపశ్చరణాఽవసరమున నచ్చటివృక్షకములను, ఘటస్తనప్రస్రవణములతో బెంచి వానియందు పుత్రవాత్సల్యము నెరపినది." ఇట్లిరువురును దమలో దాగియున్న విశాలవిశ్వప్రేమ మున్ముందు విశ్వజనీనమై విరాజిల్లునట్లు బాల్యముననే తమప్రేమాఽమృతమును జరాచరప్రకృతిలో నొలికించి ఒకరు 'జగన్మాత'గను, మరొకరు 'భరతమాత'

గను కాబోవు పవిత్రపరిణతి నిప్పుడే తమప్రవిమల ప్రవర్తనమున బ్రకటించినారు.

ఇక వీరిలో నాశ్రమ విరుద్ధమైన వికారమునకు గారకులు- అటు భావజుడు (మన్మథుడు), ఇటు భావజ రూపుడు దుష్యంతుడు. ఈభావజుల రాకయే ముగ్ధలగు పార్వతీశకుంతలల శృంగారభావసాగరములకు నిజముగ రాకయే. అనగా 16 కళలతోనున్న చంద్రుడుకల పౌర్ణమి యైనది. కాగా నిక వీరి యిప్పటి యౌవనోద్రిక్తతతో గూడిన సరసభావవాహిని గట్లుత్రెంచుకొని పొంగి పొరలు చుండెను. అశాశ్వతమగు నిట్టి యౌవనోద్దామతనుండి యుదయించిన ప్రేమగూడ నశాశ్వతముగనే యుండును. ఇట్టిప్రేమ భారతీయపవిత్రసంస్కృతికి విరుద్ధమైనది. ఇంతియేగాక, మనకాళిదాసకవి తనసౌందర్యవర్ణనమును సచ్చిదానందాత్మకమగు దివ్యప్రణయమునందే పర్యవసింపజేయుచుండు ననువిషయమును పార్వతీ సౌందర్యోత్తరభాగములో గన్గొనియుంటిమి. కనుక నిట నవయౌవనాఽహంకారదోషదూషితమైన వీరిప్రేమను నిరాకరింపదలచినట్లు మనకవీశ్వరుడు అట పార్వతికి ముక్కంటికంటిమంటలను, ఇట శకుంతలకు అగ్నివంటి దుర్వాసుని దుర్భరశాపమును గల్పించినాడు. అహంకార నిష్కాసనసమర్థములైన యీసన్నివేశ (ద్వయ)ప్రయోగ బలముచే వీరి యౌవనాఽహంకారకిల్బిష మంతరించినది.



ఇక వీరికి చిత్తనైర్మల్యసిద్ధికలుగుటకై వీరిచే మనకవి 'తపస్సు' చేయించినాడు. దీనితో వీరి శీలాదులు పదార్వన్నె బంగారమువలె వినిర్మలములై విశిష్టతేజోవిరాజమానములైనవి. ఇట్టి వీరి నైర్మల్యము వీరిసౌందర్యమునకు బవిత్రశ్రీమత్వమును, దివ్యకాంతిమత్వమును బ్రసాదించినది. ఇక వీరు తప మొనరించిన ప్రదేశములు గూడ గౌరీశంకరశిఖరదివ్యభూములు, శాశ్వతాఽనందనిలయమైన మారీచమహర్షి దివ్యాశ్రమస్వర్గభూములు. ఇచ్చటి దివ్యవాతావరణముకూడ వీరి జీవితములను దివ్యభావభాసితములుగ జేయుటలో పరమోపకారకమైనది.

జర్మన్‌దేశ మహాకవియైన 'గాథే' మహాశయు డన్నట్లు నవయౌవనవికాసవిలసితములగు పుష్పములు తమ పరిణామానురూపములైన ఫలములతో జెందిన సరససమ్మేళనమే 'శాకుంతలనాటకము'. మరియు నీనాటకము స్వర్భూలోకముల నొక్కచోట నతిసహజముగ గలుపగల్గిన పరంధామము. గాథేమహాకవి చెప్పిన-

“వుడెస్టు దౌ ది యంగ్ ఇయర్స్ బ్లోజమ్స్....”

అనే ఆంగ్లపద్యము కాళిదాసకవీంద్రుని కవితాతత్త్వనిర్ణాయకమైన ఒకసాహిత్యవిమర్శకాగ్రేసరుని యొక్క నిష్పక్షికమైన న్యాయసమ్మతమగు తీర్పు.

ఈశాకుంతలనాటక కథావిషయ మంతటినీ ఒక ప్రపంచమునుండి మరియొకప్రపంచములోనికి బరివర్త

నము సేయుటకును, భౌతికసౌందర్యపరిమితమగు ప్రేమ నుండి శాశ్వతానందదాయకమైన దివ్యప్రణయస్వర్గము నకు భారతీయదంపతుల నుద్ధరింపజేయుటకును యీ నాటక ముద్దేశింపబడినది.

శాకుంతలనాటకమునుగూర్చి శ్రీరవీంద్రకవీంద్రుని యొక్క ఆశయము లివి. ఈశాకుంతలనాటకములోని 'నాందీ' ప్రారంభవాక్యమే శకుంతలాసౌందర్యసర్వ స్వమునకు 'నాంది' యగుచున్నది. అవలోకింపుడు-

''యా సృష్టి స్స్రష్టు రాద్యా....''

''యా = ఏశకుంతల; స్రష్టుః = (కాళిదాసకవి) బ్రహ్మ యొక్క; ఆద్యాసృష్టిః = మొదటిసృష్టియో, అనగా కాళిదాసకవి బ్రహ్మయొక్క సుందరవస్తుసృష్టిలో శకుంతలయే ఉత్తమోత్తమ మగు మొట్టమొదటి సుందరవస్తుసృష్టి అని యిట ధ్వనించు చున్నది. ఈధ్వన్యర్థమే సోదాహరణముగా మదీయ 'కాళిదాసహృదయము' అనే గ్రంథములో వివృతమైనది. ఉదాహరణకు-

ఇట్లు మనసౌందర్యతత్త్వవేత్త (కాళిదాసకవి) శకుంతల యొక్క భౌతికసౌందర్యసర్వస్వమును ఒక్కుమ్మడిగ నొలికించి యిట్టి యస్థిరసౌందర్యతారళ్యముచే గల్గిన భావ చాంచల్యాఽహంకారాఽశాంత్యాదులను భావిదూర్వాసశాప మునకు మూలకములుగ జిత్రించి ఉద్దీపనవిభావభావితు లైన యీనూతన నాయికానాయకులను ఒక్కసారి కలిపి చూచినాడు. ఈయపరిణామదశలోనున్న వీరి యీకలయిక కేవలకాముకత్వప్రధానమైనది.



"యో హ్యేకసక్తః స జనో జఘన్యః''

అనుసూక్తి ననుసరించి కేవలకామపురుషార్థసేవనము మనవైవాహికసంప్రదాయరీత్యా నింద్యమైనది. కనుకనే మనవివాహాలలో కన్యాదాతచే కన్యాపరిగ్రహీతకు మన మహర్షులు యిలా చెప్పించినారు.

దాతా- ''ధర్మేఽర్థకామేషు త్వయైషా నాఽతిచరితవ్యా''

అని వివాహములో (వరునికి) మొదటినిబంధనము కదా! ఎందుకనగా- అస్థిరయౌవనోద్వేగ మచిరమైనట్లు, అస్థిరకాముకత్వముకూడ అచిరమై అప్పటిప్రేమను అస్థి రము చేయును. అస్థిరమగు నిట్టి యౌవనోద్వేగమువలన జనించినప్రేమ అస్థిరమగుటయేగాక విషాదాంతముకూడ కాగలదు.

A మంగళాంతము కావలసిన భారతీయసంస్కృతికి బైవిదాషాంతరీతి విపరీతమైనదికదా! భవ్యభావభాసుర

A "మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతాని శాస్త్రాణి ప్రథంతే। వీరపురుషకాణ్యాయుష్మత్పురుషకాణి చ భవన్తి। అధ్యేతారశ్చ ప్రవక్తారో భవంతి।''
— మహాభాష్య నిబంధనము.

అనగా "ఆదిమధ్యాంతభాగములలో మంగళకర వర్ణనములుకల శాస్త్రకావ్యప్రబంధాలను చదువుకొన్నవారు గొప్పవీరులు, ఆయుష్మంతులు అగుటతోపాటు గొప్ప ప్రవక్తలు'గా కూడ తయారగుదురు" అని మహాభాష్య వాక్యములలోని వరిష్ఠభావము.

మైన మనభారతీయపరిణయము పుత్రోదయఫలకమై పిమ్మట ఆధ్యాత్మికప్రేమతో గలిసి "విశ్వప్రేమముగ" విస్తృతముగావలసియున్నది. ఇట్టి మనమంగళసంస్కృతికి మంగళాఽలంకార మనదగిన కవికులగురువు కాళిదాసమహాకవి సమయము దొరకినపుడెల్ల మీదివిశిష్టవిషయమును వాచ్యముగనో, వ్యంగ్యముగనో సూచించుచునే యున్నాడు. ఇక ఆధ్యాత్మికప్రేమతో తన 'గృహలక్ష్మి'ని ఆరాధించుటలో శ్రీకాళిదాసకవీంద్రుని మహోపదేశములను మదీయ 'కాళిదాసహృదయ' గత మహోపదేశములద్వారా మరికొంత విన్నవించుకొందును.

మనకన్యకలు వారివివాహాదులలో నేడు చేస్తూన్న 'గౌరీపూజ'కు మూలము నాటి గిరిజాకుమారియొక్క 'గౌరీపూజ'యే. గౌరికి 'గౌరీశంకరశిఖరము'వలెశకుంతలకు మన కవిమహర్షి కింపురుషక్షేత్రమైన మారీచమహర్షియొక్క దివ్యాఽశ్రమమును తపశ్చరణానుకూలముగ జేసినాడు. అట ఆమెచే గఠినాతికఠినమైన తపస్సు చేయించి తన్ముఖమున నామెసౌందర్యాఽహంకారకిల్బిషమంతటిని క్షాళితము జేసి యామెనొక వినిర్మల సౌందర్యవిరాజితవిశ్వప్రేమమూర్తిగ పరిణమింపజేసినాడు. అచ్చట దుష్యంతుని చిత్తములో నభిజ్ఞానాంగుళీయకదర్శనముతో బరితాపాగ్నిని బ్రజ్వరిల్లజేసినాడు. ధర్మరక్షణార్థమై ధర్మాఽసనమధిష్ఠించిన తాను (దుష్యంతుడు) ఒకపూతచరితయెడ, ఒకయమాయికయెడ గావించిన దారుణకృత్యము దలంచిన



కాలందియు, నది వానియెడందను గార్చిచ్చువలె గాల్చి చేయుచున్నది. తనగృహమునకు వచ్చిన తనగృహలక్ష్మిని తనకులాభ్యుదయలక్ష్మిని, నీదాన ననివచ్చిన తనజీవితాఽనందాఽభ్యుదయలక్ష్మిని నిరాకరించి పొమ్మనిన తన (రాజు) యప్పటి మాయామోహప్రాబల్యము, ఆయజ్ఞత, అస్మృతితిరోధానము తలంచినకొలందియు తనలో దుఃఖతరంగము లతివేలములై పొంగి పొరలుచున్నవి. ఇట్టి పశ్చాత్తాపముచే రాజు—

"సంరోపితే త్మ్యాత్మని ధర్మపత్నీ త్యక్తా మయా నామ
కులప్రతిష్ఠా ।
కల్పిష్యమాణా మహతే ఫలాయ వసుంధరా కాల
ఇవోప్తబీజా ॥" 6-24

సకాలములో విత్తనములు చల్లుటచే గొప్పపంటను ప్రసాదింపనున్న తనపంటపొలమును దనచేతులార విడిచిపుచ్చిన తెలివిలేని రైతువలె నేను (రాజు) యుక్తకాలములో బీజాఽవాపనము (రేతస్సునుంచుట) చేసిన కతన మహాఫలమును (సత్పుత్రుని) బ్రసాదించుటకు సిద్ధముగనున్న నాగృహలక్ష్మిని చేతులారంగ విడిచిపుచ్చితిని. పైయుపమానముచే 'వసుంధరా' శబ్దము క్షేత్రవాచకమై—

"క్షేత్రం కళత్రే కేదారే"

అని తనభార్యనే సూచించుచున్నది. భార్యావాచకమైన యీవసుంధర మహాఫలదాత్రి. ఔరా! ఎంతటి స్వారస్యము. ఇంతటి మంచిపంటపొలమును తనచేతులార విడిచినరైతు యెంతటియవివేకి! కాని ప్రబలమైన కారణాంతరముచే తనపంటపొలమునే యీరైతు తనకాలదన్నినాడు. తిరిగి స్మృతిగలిగి తనయవివేకిత్వము తనకే తెలియగలసమయము ప్రాప్తమైనది.

ఇట్టి విచిత్రసన్నివేశముగల పైయుపమానబలముచే రాజునకు ప్రాప్తించవలసిన రెండు ప్రధానప్రయోజనములు యిట శకుంతలాత్యాగముచే భగ్నములైనవి.

"సిద్ధమన్నం ఫలం పక్వం నారీ ప్రథమయౌవనం ।
సువాసితం చ తాంబూలం సద్యో గృహ్ణాతి బుద్ధిమాన్ ॥"

అనుసూక్తిచే శకుంతలాత్యాగకారణముగ రాజునకు ఐహికభోగరాహిత్యమేగాక—

"పున్నామ్నో నరకాత్ త్రాయత ఇతి పుత్రః",

అనునట్లు పుత్రోత్పత్తికి ఆదికారణమైన శకుంతలను విడనాడుటచే 'వంశవిచ్ఛేదము' అను రెండవమహాఽనర్థముగూడ గలిగినది. అపుత్రకుడైన సార్థవాహవృత్తాంతకల్పనచే నీకవి యిటరాజును మూర్ఛాపరవశునిజేసి యతడి రాజసనిరాసమునకు దగినంత 'ప్రాయశ్చిత్తము'తో రాజునకు 'చిత్తశుద్ధి' చేకూర్చినాడు. భారతీయపవిత్ర



ప్రణయాఽనుభవమున కిక తచ్చిత్తము పాత్రమైనది. ఈశుభసమయములో శకుంతల విశ్వప్రేమవిరాజితవిశుద్ధగాత్రి, ఎంతదుర్లభమైనవస్తువో, ఎంతటి ఆరాధ్యమూర్తియో, తనయైహికాఽముష్మికసుఖంబుల కెంతటి మూలకందమో దుష్యంతున కిప్పు డవగతమైనది. అట గిరిజ తపశ్చరణాఽనంతరమున శివున కెంతటి సత్యసౌందర్యరూపిణియైనదో యిట దుష్యంతునకు శకుంతల యిప్పట్టున నంత సత్యసౌందర్యరూపిణిగ భాసించుచున్నది. ఇప్పుడామెయొక్క సత్య, నిత్య, నిరవద్య, నీరంధ్ర, నిస్తులసౌందర్యమును చిత్తరువున రాజు చిత్రింపలేకున్నాడు. దుష్యంతునకు శకుంతలావిరహము దుర్భరమై అది యామెయందు రాజునకు బూజ్యభావమతిశయింపజేయుచున్నది.

కేవలభౌతికభోగదృష్టితోనే యొక్కడును భార్యను నిత్యముగ బ్రేమింపలేడు. ఇక నామె యందలి యాధ్యాత్మికప్రేమముచే బతియామెను నిత్యముగబ్రేమింపగలుగుచున్నాడు. భారతీయుల యాదర్శదాంపత్యమునకు శారదామణిని ప్రణయదేవతగ బూజించిన రామకృష్ణపరమహంసయొక్క ఆదర్శదివ్యప్రేమయే యిట ప్రబలప్రమాణము. ఇతడు తనభార్యను భార్యగా ప్రేమించలేదు, ప్రణయదేవతగ నారాధించినాడు.

ఇట్లు మహాకవికులగురువు పశ్చాత్తాపతపస్సన్నివేశములతో నాయికానాయకుల కామవృత్తిని మథించి, వీ

రిరువురకు చిత్తశుద్ధిని సమకూర్చి వీరిని పవిత్రప్రణయ ప్రకాశితప్రవిమలమూర్తులుగ మనమహాకవి రూపొందించినాడు. ఇటుపైని వీరిప్రేమ వెనుకటివలె వికారవిషాదములను జనియింపజేయునదికాక వినిర్మలమై, సర్వసంఘపరివ్యాప్తమై భారతీయదాంపత్యప్రభావమును ప్రకాశింపజేయజాలియున్నది.

దుష్యంతునిదృష్టి కిపుడుశకుంతల మహిమాఽన్వితమగు నొకదివ్యప్రేమజ్యోతి, జీవనజ్యోతి, ప్రణయదేవత.

ఇప్పటి మనకవీంద్రుని యభిలషితమంతయు ఫలించినది. కనుక నిటుపైని యీప్రణయమూర్తులను ఒకయింటివారినిగ జేయవలసియున్నది. ఇందుకనియే నాయకునకు దేవేంద్రసహాయార్థమై 'నాకలోకప్రయాణము' కల్పితమైనది. ఈస్వర్లోకయాత్రతో మర్త్యత్వమునకు అమర్త్యత్వము, భౌతికమునకు ఆధ్యాత్మికత్వము ప్రాప్తమైనవి. చూచుచుండగనే భూలోక మొక్కసారిగ స్వర్గలోకముగ పరిణతమైనది.

ఈసన్నివేశమునే జర్మన్‌దేశ మహాకవియైన 'గాథే' మహాకవి యీక్రిందిరీతిగ చిత్రించినాడు.

"Would'st thou the Earth and Heaven itself in one sole, name Combine? I name thee, O Sakuntala! and all atonce is said." (Goethe)



ఇక ఇంద్రసమ్మానముచే నాయకునిలో దివ్యత్వం దీపించినది. ఇక దివ్యప్రణయలాభప్రాప్తి కావలసియున్నది. కనుకనే స్వర్గమునుండి వచ్చునపుడు మారీచమహర్షిని దర్శించుకోరిక రాజునకు గలిగినది. ఈకోరిక రాజునకు పుత్రసందర్శనజనితసమ్మోదమునకును, శకుంతలా పునస్సమాగమరూపమహాఽభ్యుదయమునకును మూలమైనది. మహాత్ముల సందర్శనభాగ్యము మానవజీవితములకు మహాఽభ్యుదయసంపాదన సమర్థమైనదికదా!

ఈదివ్యాఽశ్రమములో నైదేండ్లబాలు డొకడు తల్లి పొదుగులో నున్న సింహశిశువును బలాత్కారముగ లాగి, దానితో నాడుకొనుచు, దుష్యంతునకు కన్నులపండువుగ గానుపించినాడు. ఈసన్నివేశముతో రాజు చిత్తములోని భౌతికసందేహతరంగములు ఒక్కసారిగనుచ్చలితములైనవి. తుద కాదౌష్యంతి (దుష్యంతునిపుత్రుడు) దుష్యంతునకు ఆత్మజ్ఞానము-

"ఆత్మా వై పుత్రనామాఽసి"

అని "యీబాలుడు తన (రాజు) స్వరూపమే" అను నిశ్చయజ్ఞానమును కలిగించి వానికి మానుషాఽనందమునంతయు నేకకాలములో గలుగజేసినాడు.

ఇక రాజు ముక్తుడై హితబంధవిముక్తుడైనట్లు పితౄణవిముక్తితో ఋణవిముక్తిని బడసెను. ఈ'ముక్తి'తో నీరాజునకు జీవన్ముక్తునకు మోక్షలక్ష్మీప్రాప్తివలె వెనువెంటనే శకుంతలాసమాగమరూపమహాఽభ్యుదయము చేకూరినది. శకుంతలాదుష్యంతుల కీసమ్మేళనము యీ దివ్యభూమిలో "దివ్యప్రణయస్వర్గమైనది". ఇక వీరి యీపవిత్రప్రణయము ఎప్పటికినీ చలించనిది, కృశించనిది, వీడనిది.

ఇక పై పవిత్రపరిణామముతో భూతలముకూడ కాళిదాస కమనీయకవితాప్రభావముచే అతిసహజముగనే 'స్వర్గము'గ పరిణమించినది. శ్రీ 'గాథే' పండితుడనినట్లు వాసంతపుష్పములే ఒక్కసారిగా ఒక్కచోటనే ఫలములుగ పరిణమించినవి.

—



## ధార్మికవిషయసంగ్రహము

మనమహర్షులు మహిళామతల్లులకు ప్రసాదించిన మహోన్నతస్థానము.

అపత్యం ధర్మకార్యాణి శుశ్రూషా రతిరుత్తమా ।
దారాఽధీనస్తథా స్వర్గః పితౄణా మాత్మనశ్చ హ ॥ 1
ప్రజనార్థం మహాభాగాః పూజార్హా గృహదీప్తయః ।
స్త్రియశ్శ్రియశ్చ గేహేషు న విశేషోఽస్తి కశ్చన ॥ 2

– మనుస్మృతి.

1వ శ్లో. తా॥ సంతానము, అగ్నిహోత్రాది ధర్మకార్యములు, పతిసేవ, ధర్మము తప్పని కామపరితోషము, ఉత్తమసంతాన ప్రాప్తిద్వారా పితరులకును, తనకును (భర్త) స్వర్గప్రాప్తి అనే ఇవియన్నియు ఉత్తమభార్యాఽధీనములై యున్నవి.

2వ శ్లో. తా॥ సత్సంతానమును కనుటద్వారా మహోపకారమును జేసెడు స్త్రీలు గృహమును ప్రకాశింపజేస్తూన్న మహిమకలవారు. వారు గృహలక్ష్ములు. లక్ష్మలకును, స్త్రీలకును భేదములేదు.

మహిళామతల్లులనుగూర్చి యివి మనుస్మృతికారునిమాటలు.

"న గృహం గృహ మిత్యాహుః గృహిణీ గృహ ముచ్యతే"

అనగా సద్భార్యఉన్న గృహమునకే 'గృహము' అనేపేరు చెల్లుతుంది. ఆమెలేని గృహమునకు గృహము అనేపేరు చెల్లదు.

"యత్ర నార్యస్తు పూజ్యంతే రమంతే తత్ర దేవతాః ॥
యత్ర నార్యస్త్వపూజ్యంతే సర్వాస్తత్రాఽఫలాః
క్రియాః ॥"

అనగా ఏగృహములో స్త్రీలు ఆదరగౌరవప్రదానాదులచే పూజింపబడుచుందురో ఆగృహములో దేవతలు మనకు గానరాకుండగా సంతోషముతో నివసించుచుందురు. A ఇక ఏగృహములో స్త్రీలు ఏవిధంగానూ గౌరవింపబడరో అట్టిగృహములో చేసిన సత్కార్యములన్నీ (కర్తకు) ఉపయోగించకపోవుటయేగాక అవి దుఃఖజనకములే ఔతాయి. కనుక ఓగృహస్థులారా! మీలాభ, సుఖ, శ్రేయస్సంతోషములకొరకైనా 'మీ అర్ధాంగులను' ఆదరించి, గౌరవించండి.

'బ్రహ్మవిద్యాలంకార' బ్రహ్మశ్రీ ముదిగొండ వెంకట్రామశాస్త్రిమహోదయుల యొక్క "ధార్మిక భారతీయ సామ్రాజ్యమే నిఖిల ప్రపంచప్రశాంతిప్రదము" అనే వారి పదవగ్రంథరాజము ఆధారముగ ప్రపంచశాంతి లోపించుటకుగల కారణములు-

1. భారతీయ ధార్మిక అర్థశాస్త్రము, ఇట్లే కామశాస్త్రము అనే యీరెండును నేడు మనదైనికజీవనమునుండి లుప్తమగుట-

A 'పరోక్షప్రియా ఇవ హి దేవాః' అని వేదవాక్యం. దేవతలు మానవులకు కనిపించకుండా ఉండడమే వారికిష్టం. (అక్ష్ణాం పరః పరోక్షం)



2. భారతీయేతరుల చిరకాలపాలనములో స్వైరములైన వారి అర్థకామాలే భారతీయులకు గతియగుట.
3. నేటికి ప్రచారములోనున్న భారతీయ ధర్మమోక్ష శాస్త్రములుకూడ స్వైరములగు నేటి అర్థకామములచే తిరస్కృతములగుట.

ఇట్లు అశాంతిగ్రస్తమైన భారతీయసామ్రాజ్యం ప్రపంచానికి ప్రశాంతిప్రదం కాలేకున్నది. కనుక అర్థకామప్రధానదృష్టియే ప్రపంచంయొక్క అశాంతికి కారణమైనదని సారాంశం.

## -: ధర్మమోక్షప్రధానదృష్టియే ప్రశాంతిప్రదం :-

సర్వమానవజాతియొక్క శాంతికిని, యావత్ప్రపంచశాంతికిని ముఖ్యంగా చేయవలసినపని యేదనగా-

"ధర్మబద్ధములైన అర్థకామములను సేవించుటమాత్రమే. ఇదికాక ప్రపంచశాంతికి మరొకమార్గంకాని, మరొకకర్తవ్యంగాని లేనేలేదు. ఈప్రత్యేకవిషయాన్ని ఋజువుచేసే ఆర్షసూక్తులు యిలా ఉన్నాయి".

1. 'ధర్మార్థకామేభ్యో నమః' -వాత్స్యాయనకామసూత్రం.
2. 'ధర్మాదర్థశ్చ కామశ్చ' -శ్రీ వ్యాసమహర్షి.
3. "ధర్మాఽవిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ"
— గీతలో భగవానుడు

మరియు కణాదమహర్షి తన వైశేషికదర్శనములో యిలా చెప్పినాడు.

"యతోఽభ్యుదయనిశ్రేయససిద్ధిః స ధర్మః"

అనగా ధర్మబద్ధాలైన అర్థకామాలు యిటు ఐహికాఽభ్యుదయ ప్రాప్తికేకాక అటు ఆముష్మికాఽభ్యుదయ (మోక్ష) సిద్ధికికూడా సాధనా లగును. దీనికంతకు ధర్మసంబంధమే మూలము. వాత్స్యాయన మహర్షి తనకామశాస్త్రప్రథమసూత్రంలో "ధర్మార్థకామేభ్యో నమః" అనిచెప్పినాడు. ఇందు 'మోక్ష'పదాన్ని చేర్చలేదు. ఇందలి గంభీరభావం యిది. "ధర్మంతోకూడిన అర్థకామాలను అధిగమించిన వానికి మోక్షం సులభప్రాప్యమే ఔతుంది." ఈభావాన్నే అపస్తంబమహర్షి తనధర్మసూత్ర గ్రంథంలో యిలా చిత్రించినాడు.

మామిడిపండు కావాలనుకున్నవాడు ఆమొక్కను పాతి, పెంచుతూన్నకాలంలో ఆచెట్టునీడ, ఆచెట్టు పుష్పపరిమళం అతడు కోరకున్నను అవి మధ్యన కల్గిన ఫలరూపంగా అతడికి అబ్బినట్లు మానవులు మోక్షాఽర్థులై తమతమధర్మములను ఆచరిస్తూన్నప్పుడు అర్థకామాలు, సుఖశాంతులు వాటికవే కోరకున్నా ఆధర్మశీలురకు ప్రాప్తించును. మొత్తంమీద పురుషార్థాలలో మొదటిదైన స్వస్వధర్మాలను అనుష్ఠించేవారికి మిగిలిన అర్థకామమోక్షములుకూడ ప్రాప్తించునని వాత్స్యాయన, అపస్తంబ మహర్షుల పరమతాత్పర్యం.



ఈపరమార్థాన్నికూడా "ధర్మా దర్థశ్చ కామశ్చ మోక్షశ్చ భరతర్షభ" అనే గీతావాక్యం స్పష్టం చేస్తూంది.

## -: ధర్మఫలప్రభావము :-

"ధర్మో విశ్వస్య జగతః ప్రతిష్ఠా"

అనగా సమస్తజగత్తుయొక్క శాంతిసౌఖ్యాలకు 'ధర్మమే' మూలకారణమని యీఉపనిషత్సూక్తి తెలుపుతూంది. ఇందలి 'విశ్వస్య జగతః' అనే పదద్వయం సర్వభూమండలానికీ క్రిందగల సప్తపాతాళలోకాలు, సప్తఊర్ధ్వలోకాలతోకూడిన అనగా చతుర్దశభువనములతో కూడుకొనియున్న బ్రహ్మాండమంతయు సుఖశాంతులతో తులతూగుటకు- "భారతీయధర్మమే" మూలకారణమని యీది శ్రుతివాక్యంలోని తాత్పర్యము.

ఇట్లు మానవుల ఇహపరలోకసుఖలాభానికీ, మోక్షలాభానికికూడా 'ధర్మం' అనేదే మూలమౌతుంది.

## -: ధర్మభూమి - భోగభూమి :-

చతుర్దశభువనాలలో భూలోక మొక్కటే ధర్మకార్యాలను ఆచరించే అధికారము, ఆకార్యాలఫలమును అనుభవించే అధికారముకలదై యున్నది. మిగతా 13 లోకాలలోనివారు భూలోకవాసులు ఆచరించిన ధర్మపుణ్య

కార్యాలవలన పుట్టినఫలమును అనుభవించుటకుమాత్రమే అర్హత కలవారని శాస్త్రనిర్ణయము. దీనినిబట్టి భూలోక వాసుల విశిష్టత తేటతెల్లమేకదా!

ఇంకను భూలోకాఽనుష్ఠిత ధర్మఫలమే చతుర్దశ భువనవాసుల సుఖశాంతులకు సాధనమౌతున్నదనీ, 13 లోకాలలోనివారికి వైదికధర్మాఽనుష్ఠానాఽధికారం లే[illegible] "ధర్మో విశ్వస్య...." అనే శ్రుతివాక్యవిచారణవల[illegible]నే వ్యక్తమగుచున్నది. కనుకనే నిఖిలజగద్రక్షణము చేసే పరమేశ్వరుడుకూడా "భరతభూమి"లోనే దశాఽవతారము లను దాల్చి భారతీయ చాతుర్వర్ణములవారి ధర్మాలను సరిదిద్ది, తనజగద్రక్షకత్వమును సార్థకము చేసికొనినాడు. అనగా భగవానుడు భారతధాత్రికి దిగివచ్చి యిక్కడ నుండే ధర్మాన్ని ఉద్ధరించడం జరిగినది.

అంతేగాని వైకుంఠంలో ఉండికాని, కైలాసా న్నుండిగాని భువనరక్షణకార్యం చేయలేదన్నది స[illegible] విదితం.

"సర్వస్య సద్భావనాఽస్తు"
"విశ్వస్య కళ్యాణమస్తు"
"లోకా స్సమస్తా స్సుఖినో భవంతు"
"మంగళం కోసలేంద్రాయ మహనీయగుణాఽబ్ధయే ।
చక్రవర్తితనూజాయ సార్వభౌమాయ మంగళమ్ ॥"

ఓమ్ శాంతి శ్శాంతి శ్శాంతిః ।